Approved by the Text book Commitee for use in L[illegible]
Vide page 610 Fort St. George Gazette 19-11-1929 a[illegible]
page 619 Fort St. George Gazette 11-11-1930.

*Om!*

# OPINIONS

---

SITHAVIJAYAMU is written in a good style, with many happy ideas. The language is simple, and the contents of the book are valuable instructive. The book is well printed in a bold type, and is fit to be used as a text book in a High School.

N. RANGACHARY. M. A. L. T.,
*Head Master,*
R. R. Bh, R. High School,
Pithapuram.

శ్రీయుత దాసరి లక్ష్మణకవివరునిచే వ్రాయఁబడిన "సీతావిజయ" మను నీమనోహరవచనకావ్యము నామూలాగ్రముగ చదివినాఁడను. శైలి మృదుమధురమై కడుంగడు హృద్యమై యలరారుచున్నది. కథయు రమ్యమైనదియే. ఇప్పాత్రమున విద్యార్థుల కత్యంతోపయుక్తము లగు విషయము లనేకములు సూచింపఁబడినవి. నిరుపమానము లగు నీతులను, రాజనీతులను తెలుపుచుఁ బోధించుటయేకాక విద్యార్థుల కమితోపయోగకరము లగు లోకజ్ఞానవిషయము లనేకము లిందు గూర్పఁబడినవి. ఏతత్సత్కావ్యము పాఠశాలాబాలురకు సత్యంత ముపయుక్తమై యవశ్యపఠనీయమై యుండు ననుటకు లేశమాత్రమును సందేహము లేదు. గ్రంథకర్త యిట్టి యుత్తమగ్రంథముల నింకను బెక్కింటిని రచియించి లోకోపకారము నొనర్చుఁగాక !

పిఠాపురము.
1-12-33.

శ్రీ శాస్త్రదిగ్గజ
నడిపెదుటి వీరరాజు.

# అవతారిక.



ఇది ప్రాచీనకవిప్రసిద్ధమై శతకంఠరామాయణము మున్నగు నామాంతరములుగల సతావిజయము అను రసవత్ప్రౌఢపద్యకావ్యము ననుసరించి విద్యార్థులకు సులభబోధకముగ నుండునట్లు సరళమగు వచనముతో వ్రాయఁబడినది. ఇందున్న పద్యములు దానిలోనివే.

ఇందు, శతకంఠునితల్లి యగు చిత్రగంధి నచించిన నీతివాక్యములఁబట్టియు, నాంజనేయుఁడు సూపిన ప్రభుభక్తి, విశ్వాసములఁబట్టియు నీగ్రంథము నీతిబోధకమైనదనియు, రాజభక్తియుత్తమమనదనియుఁ దెల్లమగుచున్నది.

మఱియు నిక్కథ నవరసయుతమై, నవనవకల్పనలచేఁ దనరారుచు, నవయువకులకు, నవీనోత్సాహము నొసఁగూర్పఁగలదని చెప్పుట యతిశయోక్తి గానేరదు.

ఇందు విద్యార్థుల కుపకరించు ముఖ్యవిషయము లనేకములు సందర్భోచితములుగ నచ్చటచ్చట నిరూపించితిని. ఇట్టి గ్రంథములు ప్రస్తుతలోకమున కెంతయు నుపకరింపఁగలవని నాహితులు కొందఱు (హెడ్‌మాస్టరులు, ప్రిన్సిపాలురు, జిల్లా, తాలూకాబోర్డుల ప్రెసిడెంట్లు మున్నగువారలు) ప్రోత్సహించుటచే నే నీప్రయత్నమునకుఁ గడంగితిని.

నే నిదివఱలో నిట్టివిధముననె, మంచనకవికృతమగు

కేయూరబాహుచరిత్ర పద్యకావ్యకథలను "నీతికథారత్నావళి" అనుపేర వచనమున సులభశైలిని వ్రాసి ముద్రింపించియుంటిని. అది సర్వజనామోదముం బడసి యనేకపాఠశాలలలోని విద్యార్థుల కరముల వెలయుచున్నది.

ఈగ్రంథము గూడ సహృదయు లగు విద్యాభిమానుల యాదరము వడసి, విద్యార్థులకు మేలొనఁగూర్చి, నాప్రయత్నము ఫలింపఁజేయుఁగాక యని, యీప్సితఫలప్రదాయకుఁడగు పరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాఁడను.

పిఠాపురము.<br>
వి 1—12—32.

దాసరి లక్ష్మణస్వామి.

---

సీతావిజయము, లింగకవి, గంగకవి, అను నిరువురుకవులు రచించియున్నట్లు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమ కవులచరిత్రములో వ్రాసియున్నారు. కాని, విశాఖపట్టణ నివాసులగు చిన్నకోట అప్పలనరసింహులుగారు 1899 వ సంవత్సరములో ముద్రింపించిన ప్రతిలో మర్దనకవిప్రణీతమని వ్రాసియున్నారు. ఈగ్రంథపీఠికలో, లింగకవిరచితమగు గద్యగల యింకొకప్రతికూడ వీరికి లభించినట్లు వ్రాయఁబడినవి. కాని, యాగ్రంథము నాలుగాశ్వాసములకడపట నున్న నాలుగు గద్యములయందును మర్దనకవిప్రణీతమనియే యచ్చొత్తింపఁబడియున్నది! కవిద్వయస్థానమున మఱియొకకవి ప్రవేశించినాఁడు! మఱియు, పీఠికాకారులు, మూఁడవగ్రంథము లభించిన దని వ్రాసియు నందున్నకవి యెవ్వరో వ్రాయమఱచిరి! ఆశ్వాసాద్యంతపద్యములు సందిగ్ధములుగానే యున్నవి! వీనినిఁబట్టి యీగ్రంథకర్తృత్వ మెవ్వరిదయియుండునో విమర్శకు లాలోచింతురుగాక.



శ్రీ

పరమేశ్వరాయ నమః.

# సీతావిజయము.



## ప్రథమకాండము.



ఇనకులతిలకుఁడగు రఘురాముఁడు రావణాదిదుష్టరాక్షసులనెల్ల సంహరించి తిరిగి సాకేతపట్టనమున కరుదెంచి యొక శుభముహూర్తమున ననుజపరివృతుఁడై, మునిజనపురోహితామాత్యజననీత్రియానుమతమున జానకీసహితముగఁ బట్టాభిషిక్తుఁడై రాజ్యపాలన మొనరించుచుండెను.

రామరాజ్యమున ధర్మంబు నాలుగుపాదముల వర్తిల్లుచు వానలు వాంఛించినప్పుడె కురియుచు, వృక్షము లెల్లవేళల ఫలించుచు, మొదవులు పిదుకకయె దుగ్ధముల నిచ్చుచు, పైరులు దున్నకయె పండుచు, నెవ్వారికి నెట్టిలోపము లేకుండనుండెను.

మఱియు నట్టితఱిఁ బోఁకకు బుట్టెఁడేసిధాన్యంబును రూకకు నని కేఁడేసి పోఁకలును, మాడకు నఱువదేసి రూకలును జెల్లుచు నింటింట నగణితములగు మాడలు వెలయుచుండెను,

ఆ రఘురాముఁడు మనోనిశ్చలత యను నేకదీక్ష గలిగి, న్యాయాన్యాయంబు లను ద్వివిధంబుల మెలఁకువ లెఱింగి, ప్రభు,మం,త్రోత్సాహము, లనుశక్తిత్రయమునఁ జతురుఁడై, సామ, దాన, భేద, దండము లను చతురుపాయంబుల యదను దెలిసి. ఉపాయ, సహాయ, దేశకాలవిభజన, ప్రతీకార, కార్యసిద్ధు లను పంచాంగవర్తనంబుల మెలంగి, సంధి, విగ్రహ, యా, నాసన, ద్వైధ, ఆశ్రయము లను షడ్గుణములఁ బ్రశస్తిఁ గని, యగ్రహార, తటాక, నిధి, దేవాలయ, వన, ప్రబంధ, పుత్త్రు లను సప్తసంతానఫలంబుల నధిగమించి, కొండెము లాలింపక, చారచక్షుఁడై మెలంగుచు, విరోధిమర్మముల నరయుచు, తన ప్రయత్న మొరులకు నింగితాకారచేష్టలఁ గొంచెమైనఁ దెలుపక, జారచోరత్వములకుఁ దా వోసంగక, శరణు సొచ్చినశత్రు నైనఁ గాచుచు, తరతరములనాఁటి హితులఁ బోషించుచు, పాత్రదానంబు సేయుచు, పరుల నెవ్వరిని విశ్వసింపక, శరీరరక్షాక్రమంబు నేమఱక, దీనానాథజనంబులఁ గృపమీఱ రక్షించుచు, సేవకావళికిఁ జింతామణియై, బంధుజనములపాలిటి పారిజాతంబై నిరంతరదైవచింతనాపరుండై క్రాలుచుండెను.

మఱియు నారాముఁడు * చతుర్దశవిద్యాప్రవీణుఁడై

*చతుర్దశవిద్యలు :— 1 ఋగ్వేదము 2 యజుర్వేదము 3 సామవేదము 4 అథర్వవేదము 5 శిక్ష 6 వ్యాకరణము 7 ఛందస్సు 8 నిరుక్తము 9 జ్యోతిషము 10 కల్పము 11 మీమాంస 12 న్యాయశాస్త్రము 13 పురాణములు 14 ధర్మశాస్త్రము.

*చతుర్దశరాజదోషములకు లోనుగాక •చతుర్దశభువనములయం దును దనకీర్తి చిరస్థాయిగ నుండునటుల, వర్తించుచుండెను.

౨

ఇట్లుండ శతకంఠుఁ డనురాక్షసవరుం డొకఁడు తనజ్ఞాతులగురావణకుంభకర్ణాది నిశాచరవీరులు రామునిచేఁ జంపఁబడిరనువార్త విని, ఘృతయుతాగ్నివలె మండిపడుచు, హుంకరించుచు, బ్రహ్మాండమెల్ల మ్రింగ నట్టహాస మొనరించుచుఁ దన శక్తిగహ్వరముం దెఱచి, త్రిలోకభయంకరంబుగ సింహనాద మొనర్చెను.

అంత సూర్యుఁడు భయాకులుఁడై తెరువుఁ దప్పి మేఘునిమఱువుఁ జొచ్చెను; దేవత లెల్లరుఁ దల్లడిల్లిరి; మఱియు నయోధ్యాదిపట్టనములయం దనేకమహోత్పాతములుద్భవిల్లెను.

---

*చతుర్దశరాజదోషములు :—1 మంత్రగోపనము నేమఱచుట 2 దీర్ఘచింత 3 నిరర్థకపుఁజింత 4 ప్రసాదవిరహితత్వము 5 బుధావిజ్ఞానము 6 శుభాప్రయోగము 7 విషయానురాగభరము 8 అనృతము 9 ఆలస్యము 10 నాస్తికత్వము 11 అర్థములయందునపర్థమతి 12 దీర్ఘసూత్రత్వము 13 దీర్ఘదోషము 14 నిర్ణీతకార్యము లాచరింపకుండుట.

•చతుర్దశభువనములు :—1 భూలోకము 2 భువర్లోకము 3 స్వర్గలోకము 4 మహాలోకము 5 జనోలోకము 6 తపోలోకము 7 సత్యలోకము, (ఇవి ఊర్ధ్వలోకములు.)

1 అతలము 2 వితలము 3 సుతలము 4 తలాతలము 5 రసాతలము 6 మహాతలము 7 పాతాళము, (ఇవి అధోలోకములు.)

పిమ్మట శతాననుండును డెందమునఁ గొంత విచారించి "మానవమాత్రుం డగునొక్కరాముఁ డనువానికొఱకు సకల లోకంబులును బరిమార్ప నేల? వానికి గోబ్రాహ్మణదేవతాదులు ప్రియంబు లని విందు. కావునఁ దత్ప్రహారణంబులు గావించెద; ఆరాముం డందుల కడ్డపడవచ్చెనేని నాపగఁ దీర్చుకొనియెదఁగాక!"

అని నిశ్చయించుకొని మహోత్సాహమున ఋష్యాశ్రమములు పొచ్చి, హోమగుండంబులఁ బూడ్చి, యాగధేనువులఁ ద్రుంచి, సాల, రసాల, పూగ, పున్నాగ ముఖ్యభూజములఁ గూల్చి, కాసారంబులఁ గలంచి, మునిసతులఁ జెఱలుగొని, యమ్మునివరులకరములు వనలతలచే బంధించి, యనేకవిధముల బాధింపఁదొడఁగెను.

ఋషీశ్వరు లాబాధల కోర్వఁజాలక యాదుష్టరాక్షసుని పైఁ గుపితాత్ము లయ్యుఁ బద్మభవుఁ డాతనికొసఁగినవరముల చే వాని నేమియుఁ జేయఁజాలరైరి. శతకంఠుండును నిశ్శంకంబున నొకమునీశ్వరుని బట్టుకొని యాతనియూర్ధ్వపుండ్రంబు నాకుచు నింకొకవిప్రునిజన్నిద ముడిసి త్రెంచుచు, మఱియొక మౌనిపై నుర్వీపరాగంబుఁ జల్లుచు, వేఱొకసాధుశ్రేష్ఠుని నోరు నొక్కి మూయుచు, నొక్కయతీశ్వరుపిల్లసిగఁ బెల్లగిలఁదీయుచు, నొకయోగీంద్రునిముక్కుఁ జదుముచు, నొకమహీసురుని

వయి నమిరయుచు, నొక్కడిగంబరునిఁ దన్నుచు, మఱియు నొక్కనాఁ డమరులఁ దోలుచు, నొక్కతఱి మహోగ్రుఁడై మానవుల మ్రింగుచు, నీరీతి లోకంబుల నెల్లఁ జీకాకుపఱచు చుండెను.

అంత దేవతలును, ధరణీదేవతలును, జిత్తములఁ గళవళ పడి యొక్కచోఁ గూడి "మన కిఁక నెవ్వఁడు దిక్కు? ఎవ్వఁ డీబాధల మాన్పును? ఎవ్వనిచే నీదుష్టుఁ డీల్గును? ఎవ్వనికరు ణారసమున లోకము లిఁక మనఁగలవు?" అని చింతాసముద్ర మున మునింగి యపరిమితాందోళితమానసులై క్రమ్మఱ ధైర్యం బులు దెచ్చుకొనుచుండ, వారిలో సురలు మునివరుల కిట్లనిరి.

తాపసోత్తములారా! మున్ను మనకొఱకు దానవసంహా ర మొనరించుటకు విష్ణుదేవుఁడు దశరథతనయుఁడై జనియించి రాముఁ డన వెలయుచున్నాఁడుగదా? దుష్టుఁడగు పంక్తికంఠుని శిక్షించి మనల సందఱఁ గాపాడిన యావీరాగ్రేసరుఁడే మనయిడుమల నెల్ల నెడఁబాపఁగలఁడు; ఇదిగాక "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లు వీని కాయువు సెల్లియుండుటచేతనే యిట్టిదుష్టచేష్ట లొనరించుచున్నవాఁడు. కావున మీ రెంత మాత్రము జాగొనరింపక వెంటనే రామునిసన్నిధి కేఁగి మొఱ పెట్టుఁడు. మేమును దివినుండి పొడసూపెదము" దేవత లిట్లు సెప్పి నాకంబున కరిగిరి.

## 3

అంత శాండిల్య, కౌండిన్య, గాలవ, జాబాలి, మాండవ్య, మైత్రేయ, మందపాల, మార్కండేయాదిమౌనివరు లెల్లరుఁ బయనమై చనిచని యసమానవైభవోపేతంబగు సాకేతంబును గాంచి, తదీయపరిఖాప్రాకాలంబును, ప్రాకారౌన్నత్యంబును, గాంచనగేహసముదాయంబును, గంధగజాశ్వరథాదులను, మించినవేడ్కతోఁ దిలకించుచు మెల్లన వీడ్కొని, తత్పురమధ్యంబున వెలుఁగొందు నొకకనకమయప్రాసాదముం గాంచి మెచ్చుచు, తన్మందిరమధ్యభాగంబునఁ దనరారు మణిగణశోభామయ మగు నొకసింహాసనముం గాంచి, యం దాసీనుఁడై యున్న శ్రీరామభద్రునిఁ గన్నులకఱవుదీఱ విలోకించి సాంద్రప్రమోదరసపరిపూర్ణహృదయులై వివిధమంత్రాక్షతలతోడి హస్తంబు లెత్తి "జయజానకీప్రాణనాథా! జయభూదేవమందారా! జయభక్తసంరక్షణదీక్షాదక్షా!" అని యాశీర్వదించిరి.

అంత రాఘవేశ్వరుఁడు మునీశ్వరుల కందఱకుఁ బ్రత్యుత్థానాభివందనములు వేఱువేఱ నాచరించి, వారల నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి యుచితపీఠంబుల నాసీనులఁ గావించి మఱి దస్మితవదనారవిందుఁడై యానంద మందంద సందడింప, మెల్లన మునివరుల కిట్లనియె.

మునికులతిలకులారా! భవత్పవిత్రపాదారవిందచింతనవిశేషంబునఁగదా మావిభవంబు లెల్ల నిరంతరాభివృద్ధిఁ గను

చు మోదంబు నొడఁగూర్చుచున్నవి? మీర లేయేస్థలముల
కేఁగుదెంతురో, మీశుభవీక్షణము లెచ్చోటఁ బ్రసరింపఁజేయు
దురో, ఆయాతావులు వృద్ధిఁబొందుచుండును గదా!

మహాత్ములారా! మీకును, మీశిష్యులకును, పరిజను
లకును, సేమమే కదా? ధేనువు లనిశము క్షీరములఁ బిదుకుచుం
డునే? తరువు లెవ్వేళల ఫలంబుల నిచ్చుచున్నవియే? తపోధ
ర్మంబులు, యజ్ఞార్థంబులు ననవరతము నిర్విఘ్నముగఁ బ్రవర్తి
ల్లుచుండునే?

పవిత్రచరిత్రులారా! భవదీయకరుణాకటాక్షవీక్షణంబు
నఁగదా నే నీధాత్రీతలంబెల్ల నేకచక్రముగ నేలఁగలుగుచుంటి
ని? సన్న్యాసత్వముఁ బూని నన్నింతయు సమ్మానించియున్న
మీ కెట్టియిక్కట్టును దటస్థింపదుగదా? దాసుఁడ నగు నాకు
మీర లెట్టికార్యము నియోగించిన నది తప్పక నెఱవేర్పఁగల
వాఁడను; దాఁపరిక ముంచక మీవచ్చిన కార్యము తెలిం గెఱిం
గింపుఁ" డని వేఁడుకొనుటయు, మునులెల్ల రత్యంతసంతోష
మొంది యిట్లు వచింపఁదొడఁగిరి.

"శ్రీరామచంద్రా! నీమహిమము గొనియాడ మా
బోంట్లకు వశమగునా? లోకకంటకు లగు రావణకుంభకర్ణాది
క్రూరరాక్షసుల నెల్ల రణరంగంబునఁ బరిమార్చి మాబాధల
నెల్లఁ బాఱఁద్రోలితి వింతకంటె శుభంబు మాకేమి కావలయు?

"ఇదియునుంగాక మహేంద్రు నరాజ్యమాఱు లాభావ

మున నిర్జించి తదీయసతులను జెఱలువెట్టి మహోగ్రరణకాం క్షను జరించిన వీరుం డగు నింద్రజిత్తుని, దోయధుల నన్నిటిని దోయిటఁబట్టఁజాలి వాయువును బంధించు నేర్పెఱింగి, శిఖవాతేఁ బడిదైన వెడలనేర్పు మాయాయుతవిక్రముం డగు నయ్యతికాయుని, చిన్ననాఁడె యమునిపీఁచ మణఁచి, త్రిభువనాధీశుల నెల్లర ధిక్కరించిన మహాకాయుని, దేవేంద్రు నొక్కఁ వ్రేల్మిడి నోగఱీఁటు శక్తి గలిగి, యప్రతిద్వంద్వసాహసులై నకంపనాకంపనులను, గృతాంతునైన నంతమొందించు సమర్థత గలిగి భీమగదారణకౌశలమున దశాననుని మెప్పించుదర్పము గల దేవాంతకనరాంతకులను, సాహవమున నెదిరింప నీకె కాక యితరులకు సాధ్య మగునే?

మఱియు దేవదానవసంగ్రామరంగవిరోధుం డగు మహోదరుండును, నిఖిలశత్రుభీముం డగు ఖడ్గరోముండును, వనలసదృశుం డగు సర్పరోముండును మొదలుగాఁ గల యపారబలపరాక్రమవంతు లగు దానవుల నెల్ల నశ్రమమున సంహారింపవే? అదియునుంగాక దుష్టనిగ్రహశిష్టపరిపాలక, జగదేకవిక్రమాది బిరుదంబులు నీకకాక యన్యులకుఁ జెల్లునే?" అని యిట్లు స్తోత్రములు చేసి మునీంద్రులు రామచంద్రునకు మరల నిట్లనిరి.

"రఘుకులతిలకా! తొల్లి నీదయావిశేషంబున సమస్తజనులు సంతోషసాగరమునఁ దేలియాడిరి. కాని యిప్పుడు సంభవించినబాధలవలన మిగులఁ జింతనొందుచున్నవారలు. నీ

కావార్త తేమని విన్నవింతుము; శతకంఠుం డనునొకదుష్టరాక్ష
సుఁడు కమలగర్భునిచే వరమ్ములంది కండకావరమునఁ జరించు
చు లోకములఁ గలంచుచున్నవాఁడు. మున్ను దశకంఠునిబా
ధలకె తాళఁజాలక యెట్లో నీయనుగ్రహమున బ్రదికితిమి.
ఇప్పు డీశతకంఠునిబాధల కెట్లోర్వఁజాలుదుము? ఆదురాత్ముఁ
డొనరించెడి బాధలకు వెఱచి దేవత లెల్లరు నీమఱుఁగుచొరఁగ
వరుదెంచి యుండ యభ్రవీథి నెట్లు నిలిచియున్నవారలో వీక్షిం
పుము."

అని చెప్పుటయు రాముం డల్లనఁ దల పైకెత్తి చూడ,
దేవతలు పొడసూపి పారిజాతప్రసూనంబు లాతనిపైఁ గురియిం
చి యంతర్ధానంబు నొందిరి; రాముండును విషణ్ణహృదయుఁడై
చింతించి "తొల్లి పదితలలరక్కసు నుక్కణఁగింప నోపక సీతా
వియోగుండనై యకారణమున వాలిం ద్రుంచి, కోఁతులము
ఉపుసాచ్చి, యనేకప్రయాసంబుల వైరంబుఁ జక్కంబెట్టి లో
కంబుల నుద్ధరించితి; అది యట్లుండె; నూఱుతలలును, గరశత
ద్వయంబునుం గల యీదానవు నిప్పు డెట్లు సంహరింపనేర్తును?"
అని యుల్లంబున వగచి వెండియు నమ్మునీంద్రులతో నిట్లనియె.

"మానివరులారా! ఆదుష్టరాక్షసుఁ డెవ్వనికిఁ బుట్టె?
ఎవ్వనిగూఱి కింతచేసె? ఎవ్విధి వరములఁ గోరె? పద్మసంభవుఁ
డెట్లానంగె? భయం బుడిగి మీర లీవృత్తాంతమంతయు నా
కెఱిఁగింపుఁడు; మీయనుపున నే నేఁగి యాపాపకర్మునిఁ ఖండన

ముచేఁ జెండాడెద;" నని పలుక మునివరు లమందానందకందళితో ద్భూదయారవిందులై "శ్రీరామచంద్రా! మే మాతనికథ యంతి యు సవిస్తరముగ విన్నవించెద మాలింపు" మని యిట్లు వచిం పఁదొడఁగిరి.

ఋషిశ్రేష్ఠుఁడును, సుప్రసిద్ధుఁడును నగు పులస్త్య *బ్రహ్మకు గృహస్థాశ్రమమున విశ్రవసుండును, అశ్రముండునను సిరువురుకొడుకు లుదయించిరి; అందు విశ్రవసుఁడు కైకసి యనురాక్షసిం బాణిగ్రహణంబుఁ గావించి, దానివలనఁ గ్రమ ముగ రావణ, కుంభకర్ణ, విభీషణాదులగు జగదేకప్రతాపులఁ గాంచెను.

అశ్రముం డనువాఁడు చిత్రగంధి యనుగంధర్వవధూ టిని జెట్టఁబట్టి సంతానంబుఁ గానక చింతించి, తనయన్నకొమరు లగుదశకంధర, ఘటకర్ణ, విభీషణప్రముఖుల బలపరాక్రమము లఁ జూచి లజ్జించి తనమనంబున నిట్లు యోజించెను.

తనయులు లేని నిలయంబును, జనపతి లేనిరాజ్యంబును వినయము లేని విద్యయు, వివేకము లేని వైద్యము, కనకము లేని భాగ్యము, సుగంధము లేని సుమము వ్యర్థములు. ఇదిగాక "అపుత్రస్య గతి ర్నాస్తి" యని యందురు. కావున నే నిప్పుడే

* బ్రహ్మలు తొమ్మండ్రు :—1 భృగువు, 2 పులస్త్యుఁడు, 3 పుల హుఁడు 4 అంగీరసుఁడు 5 అత్రి 6 క్రతువు 7 దక్షుఁడు 8 వసిష్ఠుఁడు 9 మరీచి.

యరణ్యమున కేగి *త్రిమూర్తులనుగూర్చి తపం బాచరించి దశకంఠునికంటెఁ బ్రతాపశాలియు, నూఱుశిరములు,నిన్నూటఱు కరములుఁ గలిగిన 'కుమారు నొక్కనిఁ గాంచెద" నని తలంచి తత్క్షణమే వనాంతరమున కేగి ముమ్మూర్తులను హృదయమున నిలిపి ఘోరతపం బొనరింపఁ ద్రిమూర్తి స్వరూపుఁడు దానె యగుట నిసుఁడు ప్రత్యక్షమై యాతనితపస్సున కెంతయు సంతసించి జగద్భయదాకారుఁ డగునొకపుత్త్రు నాతని కొసఁగెను.

ఈరీతి నశ్రముఁడు భండనోద్దండశతద్వయభుజాదండుఁ డగుపుత్త్రునిఁ బడసి, లంకకంటె సహస్రగుణాతిశయంబగు ప్రతాపలంక యను నొక్కపట్టనము ♦పంచమసముద్రమధ్యమున నావెంటనే విశ్వకర్మచే నిర్మింపఁజేసి యందు శతకంఠునికిఁ బట్టముఁ గట్టి వెండియుఁ దపంబున కరిగె.

అంత నీవును రావణముఖ్యక్రూరాసురులను సంహరించి జగంబు నుద్ధరించితివి. అట్టితఱిఁ దనజ్ఞాతులగు రావణకుంభకర్ణాదులమరణములు విని, యాశతాననుఁడు లయకాలాగ్నివలె మండిపడి తనమనమున నిట్లు తలంచెను.

రావణుఁడు దీర్ఘాలోచనసేయక దనకు నరులు వానరులు దృణప్రాయులుగ నెంచి తక్కినవారిచేఁ జావులేకుండ బ్రహ్మచే

---

*త్రిమూర్తులు:—1 బ్రహ్మ 2 విష్ణువు 3 ఈశ్వరుఁడు.

♦ సముద్రములు :—1 లవణసముద్రము 2 ఇక్షుసముద్రము 3 సురాసముద్రము 4 సర్పిసముద్రము 5 దధిసముద్రము 6 క్షీరసముద్రము 7 శుద్ధోదకసముద్రము.

వరము వడసి తుదకుఁ దా హతుఁడయ్యెను. నే నట్లుగాక పురుషులచే నెవ్వరివలనను జావు లేకుండ విరించిని వరంబుఁ గోరి యటుపిమ్మట రాముని సంహరించి నాయగ్రజులవగఁ దీర్చు కొనియెదఁగాక !

అని నిశ్చయించుకొని ప్రతాపలంకాపురీపాలనమునకు నాప్తులగు మంత్రులఁ బ్రతిష్ఠించి, *నవరత్న, కనక, రజత, తామ్రాదిలోహవినిర్మిత నవప్రాకారరక్షకులగు రాక్షసుల నప్రమత్తులుగ నుండఁ బ్రోత్సహించి, యొకమహారణ్యమునకుఁజని కృతస్నానుఁడై, భారతీరమణు నుద్దేశించి జగదద్భుతముగాఁ బంచాగ్నిమధ్యమున బొటనవ్రే లూఁతగా నిల్చి హస్తంబు లెత్తి ప్రచండమార్తాండమండలంబుఁ జూచుచు నిరాహారుఁడై వెయ్యేండ్లు తపంబుఁ గావించెను.

అంతట వానిఘోరతపంబునకు జగంబులెల్ల తల్లడిల్లె ; రవిచంద్రులు గతులఁదప్పిరి; •అష్టదిక్కులదరె; †దిక్పాలకగణంబు బెదరె; అట్టితఱి హిరణ్యగర్భుఁ డొక్కమొగి నేతెంచి కత

*నవరత్నములు :—1 వజ్రము 2 వైడూర్యము 3 గోమేధికము 4 పుష్యరాగము 5 మరకతము 6 మాణిక్యము 7 నీలము 8 ప్రవాళము 9 ముత్యము.

•అష్టదిక్కులు:—1 తూర్పు 2 ఆగ్నేయము 3 దక్షిణము 4 నైఋతి 5 పడమర 6 వాయవ్యము 7 ఉత్తరము 8 ఈశాన్యము.

†దిక్పాలకులు:—1 ఇంద్రుఁడు 2 అగ్ని 3 యముఁడు 4 నిర్‌ఋతి 5 వరుణుఁడు 6 వాయువు 7 కుబేరుఁడు 8 ఈశానుఁడు.

కంథునిఁగని, యబ్బురమంది, కరుణారసంబు పెల్లుబ్బ నిట్లనియె.

"ఓయీ కంఠాస్యా! భవదీయతపోవిశేషమునకే నెంత యు మెచ్చితిఁ; వలసినవరంబుఁ గోరు మిచ్చెద!' నని వచింప కంఠాననుఁడు చతురాననుని జూచి కరములు మోడ్చి, దండప్రణామంబుఁ గావించి, "కరుణాసాగరా! కమలగర్భా! నెయ్యంబున వరంబు లొసంగు దయ మీ కుండెనేని యక్ష, రాక్షస, గరుడ, గంధర్వ, సిద్ధ, సాధ్య, విద్యాధర, బృందారక, కిన్నర, కింపురుష, నర, వానరాదులగు పురుషులవలనను, మృగాండజ, భుజంగమలోకంబులవలనను, మీన, కర్కట, మకర, కచ్ఛపాది జలచరసముదయంబువలనను, నాకు మరణము లేకుండఁ బ్రసాదింపు" మని వేఁడుకొనెను.

కమలాసనుఁడు వానికోరినవరములు దయచేసి మఱియు నొక్కవరము వేఁడుకొను మనిన దనుజేంద్రుఁడు హర్షించి, రణంబు సేయునెడఁ దనశరీరమునఁ గల శోణితకణంబు భూమి పయి నెచ్చటఁ దొరంగు నచ్చట నూర్గురు శతముఖు లుదయిం చునట్లుగా ననుగ్రహింపు మనవుడు జలజాసనుండును నత్తెఱం గునకు సమ్మతించి, నీతపోమహిమమునకుఁ *త్రిలోకములు నెం దును సరియెఱుంగము గావున నీకు నొక్కవరం బొసంగుదు మని సుప్రసన్నుఁడైనం గని "జరయు, శ్రమంబును, [illegible]పంబును భయంబును, దైన్యంబును దన్నెన్నండును బొరయకుండ వరం

*త్రిలోకములు:-1 స్వర్గలోకము ౨ మర్త్యలోకము ౩ పాతాళలోకము.

బొసంగవే” యని యాతఁడు కోరుటయు, విరించి యట్లయగుఁ
గాక యని దీవించి యదృశ్యుఁడయ్యెను.

అంతఁ గమలసంభవదయాసంప్రాప్తవరప్రభావుఁడైన
శతముఖుఁడు ప్రతాపలంకాభిముఖుఁడై, చని తత్పురముఁ బ్ర
వేశించి, రావణకుంభకర్ణాదులఁ జంపిన పగ నీఁగుటకై రాముని
సంహరింపఁదలఁచి యాతఁ డగపడుదనుకఁ దత్ప్రియంబులగు
గోబ్రాహ్మణమునిసంఘముల హననముఁ గావింప నెంచి ప్ర
ధానులును, దండనాయకులును దన్నుం గొలువ సకలదిక్కులు
బ్రక్కలు గావించి, దేవతలపురంబులకు దాడిపెట్టి, దివిజులఁ
బాఱఁదోలి, మరలి మాయాశ్రమంబులు చూఱలాడి, కొంద
ఱ మునులఁ జంపి, పతివ్రతలగు తరుణుల నెల్లరఁ జెఱలుగొని,
హోమధేనువులఁ దునిమి, మఱియు నిట్టిహింస లెన్నేని గావిం
పఁదొడఁగెను.

రాఘవేశ్వరా! నీవుదక్క మా కిఁక దిక్కు వేఱె లేనం
దున, నమరవరులు నిన్నుఁ జేరి వేఁడుకొం డని వచింప మే
మిట్లరుదెంచితిమి; కరుణాతిరేకమున మా కభయమిచ్చి ప్రోవ
వే” యని కన్నుల నశ్రుధార లొలుక నేడువఁదొడఁగిన రామ
భూవరుఁడు దయాళుఁడై, “తాపసవర్యులారా! దుష్టాత్ముఁడై
యిట్టిదుడుకుచేష్టలొనరించు నాకట్టిడిరక్కసుని *పంచభూతము
లుసాక్షిగనేఁ బరిమార్చి మీకును, సురలకును, సంతోష మొ
నఁగూర్చెద; మీ రిఁకఁ జింతదక్కి యుండుఁ” డని యభయం
బొసఁగి వారల నందఱ నాశ్రమంబులకుఁ బనిచెను.

* పంచభూతములు, 1 పృథ్వి 2 అప్పు 3 తేజస్సు 4 వాయువు 5 ఆకాశము.

# ద్వితీయకాండము



అనంతరము రాఘవుఁ డేకాంతస్థలమునఁ గూరుచుండి శతముఖునిజన్మమహిమయు, నాతని తపశ్శక్తియు, వరములఁ గొనుటయు, మనమునఁ దలపోసి తాను రాక్షసాంతకుఁ డయ్యును, మానవుఁడై యుంటఁజేసి తనమహిమఁ దానెఱుఁగనేరక యూరక సునిపరాక్రమాదులఁ దలఁచి దీనవదనుఁడై చింతిం చుచుఁ గొంతవడికి సోదరులను, సుమంత్రాదిమంత్రులను జెంతకు రావించి వారలు వినఁగ లక్ష్మణునితో నిట్లనియె.

" లక్ష్మణా ! నాహృదయమునఁ జేయివెట్టి కలఁచిన ట్లున్నయది. మనసైన్యములు లవణేక్షుసురాసర్పిసముద్రము లేవిధమున దాఁటవచ్చు ? దాఁటెఁబో విధాతృఁడిచ్చిన వర గర్వమెత్తెఱంగునఁ గడపవచ్చు ? గడచెఁబో నవపరిఖాయుత ప్రాకారపట్టనం బెట్లు లగ్గవట్టవచ్చు ? పట్టెఁబో రణరంగమునఁ బరపురుషా జేయుఁడగునా దనుజవల్లభు నెట్లు సంహరింపవచ్చు? అక్కటా ! మునీశ్వరులు నేఁ డిట్లేల వచ్చిరి ? నే నిటు లేల ప్రతినలు గావించితి ? ముందువెనుక లరయక పలుకుట యెట్టి వారికైన హానికరముగదా ?"

అని వచించి తానునులక్ష్మణుండును దక్కఁ దక్కినబల సాధనసామగ్రి చాల దనియుఁ జతుస్సముద్రలంఘనము దుర్ఘ

మనియుఁ దలఁచి నిర్విణ్ణహృదయుఁడై యూరకుండె. మంత్రులు నిట్టిట్టని యూహింపనేరరైరి; తత్ప్రకారంబు లీక్షించి సౌమిత్రి శోకాపారుణితలోచనుఁడై రామచంద్రున కిట్లనియె.

"అగ్రజా! శతముఖుండగు నారాక్షసు నెట్లు సాధింపఁగలఁడో యని మీరింతగాఁ జింతనొందనేల? తూలికాపర్వతమును ధూళిఁ గావింప నొక్కింత యగ్నికణము చాలదే? నేఁ దలంచినచో శశిదివాకరబింబముల నొక్కుమ్మగఁ గబళింపనోపనె? పిడుగుంబోలు నాముష్టిహతిచేఁ బృథివియు, నింగియుఁ బొడి పొడిసేయనే? అట్టినాముందఱ నాశకాస్యు నేల పొగడెదరు?

"ఇదియునుంగాక ఘోరతపం బాచరించి సుత్రామాదులు మెచ్చఁ ద్రినేత్రునిచేఁ ద్రిశూలముఁ గొనిన లవణాసురుని దునుమాడి మీ కెల్లర కమందానంద మొనఁగూర్చిన శత్రుఘ్నుండును, అపారఘోరసంగరతరుణమున దుర్విమతఖండన మొఱంగి క్రిమ్మఱ విరోధిబల మెత్తివచ్చినేని విజయం బొనఁగూర్చుకొనెడి నేర్పుగలిగి నిరుపమవిక్రమంబున నీకు నెనవచ్చు భరతుండును, అధ్వరాశ్వమునకై మమ్మందఱ గుండెలవియఁగొట్టి తుదకు మేటియుద్ధమ్మున మిమ్ముఁగూడ నొప్పించిన యుద్దంతులగు కుశలవులును, అనవద్యరణవిద్యావిశారదుండును, అతులబలశౌర్యశాలియుఁ బరరాజభయంకరుండును నగు కుశకుమారుఁడు విజయుండును, దేవకల్పులును, రణోత్సాహులును నగు డెబ్బదిరెండుకోట్ల వెల్లువల వానరభటులు గొలువ

మృత్యువునైన జయింపఁజాలు పరాక్రమశాలి యగు సుగ్రీవుం డును, బద్ధునిని గజంబువోలె మండోదరి నల్లనఁ బట్టితెచ్చుచుఁ గవుల కెల్లర కత్యంతసంతోష మొనఁగూర్చి, దశకంఠహృన్ని ష్ఠాభంగ మొనరించిన వానరశ్రేష్ఠుఁ డగు నంగదుండును, నీవ తల్లివి, దండ్రివని యెంచి నీ కెల్లప్పుడు హితవాక్యములఁ జె ప్పుచు భండనమునఁ బ్రత్యర్థిసంహారుం డని పేరికెక్కినజాంబ వంతుండును, సాలతరుయుగ్మమునుఁ గేలంబూని వాలం బభ్ర తలమ్ము సోఁకఁజాఁచి, దిక్కులెల్ల వ్రక్కలగున ట్లార్చుచు నరివీరుల నంతమొందించు పరాక్రమశాలి యగు నీలుండును, నుండ మన కింత వంతయేల ?

" మఱియు వానరకులోత్తారకుండగు తారకుండును, మహాభుజుండగు గజుండును, వజ్రధారాప్రతిమానకరభుండగు శరభుండును, సమరవిజయస్తోము లగు గోముఖ, గందమాదన, ఋషభ, మైంద, ద్వివిద, వేగదర్శి, గవయ, ప్రముఖనిఖిలమ హావనచరచమూనాయకులును, గడంగిరేని యాలోకములోకంబు లుం బరిమార్పనోపరే ?

"ఇంతియకాక మీరు పెట్టినచెట్టు విభీషణుం డిట్టిసమ యమునఁ దోడురాకుండునే? అతం డలిగిన సకలబ్రహ్మాండము ను గంపింపవే? ఇంతబలసామగ్రి గలుగ ససురవరునికొఱకు మి కింత వంతనొందఁదగునే? " యని వచించి బలవంతుండగుహను మంతుని హృదిందలంచి చిఱునవ్వు లొలయ మఱియునిట్లనినా

"అన్నా! మన్నించి యింకొక్క విన్నపమాలింపవేఁ డెదను; పుట్టినప్పుడె నింగి కెగసి భానుని స్వర్ణాభానుపగిది మ్రింగిన మేటియుఁ, బారావారమును బిల్లకాల్వయుఁబోలెఁ గుప్పించిదాఁటిన యసమానజవశాలియు, లంకాపురమున కేఁగి సురలెల్లరు మెచ్చ యాక్షునినంహరించిన యధికబలశాలియుఁ, గోపావేశమునఁ దత్పురమంతయు నగ్ని కాహుతియొనరించిన దిట్టయు, నగు గాడ్పుపట్టి గలిగియుండ మన మిఁక వగవవలసినపని యేల? అతఁడు గడంగినఁ గుతలంబెల్ల నొక్కవ్రేల్మిడి నెగమీటఁగలఁ డిఁక శతకంఠుఁ డనఁగ నెంత?

,,మఱచితిరే! నాఁడు మనల నిరువురఁ గొనిపోయి మైరావణుఁడు పాతాళంబున భద్రకాళికిఁ బ్రియంబుగా నిచ్చి బలియీయఁబూనుసమయంబున నొకశతపత్రనాళంబున సూక్ష్మరూపమునఁ జొచ్చి, యచ్చోటఁ గాపున్న మత్స్యవల్లభునితోఁ బెనఁగి యతిరయమున నప్పాతాళలంకానివాసులగు రాక్షసుల నెల్లర నిర్మూలంబుఁ గావించి, పిమ్మట మైరావణునితోఁ బోరాడి సప్తభ్రమరంబులతోడ వానిప్రాణంబులఁ గొని మనలను బ్రదికించెఁగాదె?"

,,అట్టిప్రాణబంధుండును, శౌర్యధురంధరుండును నగు మరుస్నందనుఁడు మన కాప్రుఁడై యున్నవాఁడు. అదియునుఁ గాక సకలదేశాధీశులును, సుఖదుఃఖములకు మనలోనివారు గావి వెలిగాఁ బ్రవర్తింపనేరరు. ఇంతయు విచారించి సంగర

మునకరిగి శతముఖుని సంహరించి లోకముల నుద్ధరింపుము. భద్రిదంతావళమువోలె నిన్ను నీ వెఱుఁగవుగాని రణరంగమున నీ వలిగితివేని బ్రహ్మాండంబెల్ల నొక్కనిముసములో భస్మీభూతము గాకుండునే" అని ప్రబోధించుటయు, జానంధవుండు లక్ష్మణున కిట్లనియె.

"అనుజా! నీవచించిన దంతయు సత్యమే కాని;

"గీ. కార్యఖడ్గము లను రెండు గతులయందుఁ
గార్య ముత్తమ మది చక్కఁ గాకయున్నఁ
బలువిధంబుల నవ్వారిబల మెఱింగి
ఖడ్గ మొనరింప నటమీఁది కర్జ మండ్రు"

కావున మొదట సామదానమాయోపాయభేదంబుల నాశతాస్యుఁ బరిమార్ప నెంచెద. అట్లొనఁగూడకున్న దండంబున నాదుండగీనిదండధరునిలోకంబున కనిచెద, వాఁ డననెంత? ఇంతలో విభీషణుని రావించి, యతనివలన శతాననునివర్తనము లన్నియుఁ దెలిసికొని యటమీఁద నమ్మహాత్ముఁడు వచించిన చొప్పున జరుపుదము"

౨

అని విభీషణునిఁ దలంచిన నతండును దవమనమున హర్షించి, యతిశీఘ్రగమనంబున మంత్రులతోఁ దోయధి దాఁటి యనూనజవంబున నభ్రవీథి నరుదెంచి సాకేతంబుఁ బ్రవేశించి రాముని సందర్శించి యాతనిపదపద్మములకుఁ దననిటలతలము

సోఁక నమస్కరించి పలుతెఱంగుల రామచంద్రు నభినుతించెను.

అంత రాముం డమ్మధురమృదులభాషణుఁడగు విభీషణునిఁ గ్రుచ్చి గాఢాలింగనముఁ గావించి, యానందాశ్రుజలపరంపరలు దొఱుఁగ సరగునఁ దనదండ నొక్కయుచితపీఠమునఁ గూర్చుండఁజేసి యాతనిసేమము లడిగి తెలిసికొని మన్నించి మెల్లన నిట్లనియె.

“దైత్యోత్తమా! నే నాదినమున దశకంఠబాణాగ్నినిఁ బడి చేయూఁత నశక్తుఁడనై యున్న తరుణమున నీ వానిశాచరువిమర్మకర్మంబు లెల్ల నాకెఱింగించి వానిని మడియింపఁజేసితివి. నాకు నీవంటియాప్తుఁ డింకొకఁడు గల్గునే? నిన్నప్పు డొక్కనావఁజేసి సంగతార్ణవము నీఁదఁగంటిని. ఇప్పు డంతకంటె నొక్కప్రశ్రయం బుద్భవిల్లినది. అది యెట్టి దనిన వినుము.

నూఱుశిరములు, నిన్నూఱుకరములుఁ గలదైత్యేంద్రుఁ డొక్కఁ డుద్దండుఁడై కండకావరమునఁ దాపసులను, దేవతలను జంపి యనేకవిధముల గోబ్రాహ్మణహాననంబులును, సకలదిశారమణతాడనంబులును గావింప నద్దురాత్ముఁ డొసరించుబాధలకుఁ దాళఁజాలక మునిదేవతానివహంబు లరుదెంచి తమతమబాధలతెఱం గంతయు నెఱింగించి శరణుసొచ్చిన, నేను వారలఁ గరుణించి యభయహస్తంబు లిచ్చి పంచితి. ఇఁకమీఁద నేదియుం దెలియక యద్దానవునివర్తనము లన్నియు నీచే నెఱుంగఁగోరి నిన్నిట రావించితిని.”

అని వచింప విభీషణుఁ డారామునికరుణావలోకనమహి మమున కెంతయు నచ్చెరువంది మచ్చిక నిట్లనియె. "రఘుకు లోత్తమా ! కఠినకంఠీరవంబుతో నొక్కభద్రేభం బెదిరింపఁజా లునే ? ప్రచండానలజ్వాలలకు శుష్కగహనము నిలిచియుండఁ గలదె ? ఝంఝూప్రభంజనమహాధాటితోఁ గొలఁదిజలదము మార్కొననేర్చునే ? అశీతకంఠుఁ డెంతటివాఁడైన నెట్టివరము లుగొనిన మీతోడ నెదిరించి ప్రాణములఁ దక్కించుకొనఁజా లునే ? రామచంద్రా ! పగవానిని మీయెదుటఁ బొగడుట పాడిగాదు. ఐనను నన్నడిగితిరి కావున నాదైత్యవల్లభునిమర్మ మెల్ల నెఱిఁగించెద.

ఆదిశేషునకైన వర్ణింపనలవిగాని ప్రతాపలంకావైభవ ము నాయట్టివాని కొక్కింతయైనఁ బొగడఁదరమగునా ? నాక వాసులకైన భీకరములగు తొమ్మిదిప్రాకారములు గలిగి పరిఖా జలప్రమాణము రసాతలము నతిక్రమింప బ్రహ్మరుద్రాదులకు సైతమభేద్యమై ప్రవర్తిల్లు.

దీర్ఘజిహ్వ, శిఖిముఖ, స్థూలకంఠ, యోజనహస్త, దు ర్ముఖ, శూర్పకర్ణ, రక్తాక్ష, పింగళాక్ష, గజోదర, త్రిముఖు లనుమంత్రులు పదుండ్రు వానితో వర్తింతురు. అందు నొ క్కొక్కమంత్రి మృత్యువునైనఁ బొరిగొనఁజాలును. అంద ఱుఁగూడినఁ బదునాల్గుభువనంబులుఁ జప్పరింతురు. వారికి నా ధుండు శతముఖుండు, అతఁడు పరమేష్ఠిచేఁ బరపురుషాభేద్యత్వ

ము మొదలగు పెక్కుదుర్లభవరములు గొని విఘ్నశంకరాదులం
ద్రృణీకరించుచుండును.

మఱియు నేను మిమ్ము సేవించి మీచేత రావణాదులం
దునిమించితి వని నన్నాతం డెప్పుడును జంపందలంచుచుండును.
వానికు వతనికి వైరం బెప్పుడును గలదు. బలాధికుండగు శతా
స్యుండు మదోన్మత్తుండై మనపై నెక్కడ దాడివెడలునో యని
నే నెంతయు భయమంది తారకాచలగహ్వరాంతమున దాంగి
యుండును. శతముఖునికింకరులు తన్నెప్పుడు చంపవత్తురో యని
దశదిశలు చూచుచుండుటకుం దనచూపులు చాల వని కాదే
స్వర్గాధ్యక్షుండు సహస్రాక్షుం డయ్యెను?

బలంబునకుం బరాక్రమంబునకు నెంచిచూడ శతాసను
నకు, దశాననునకు, హస్తిమశకాంతర మున్నది. వానిం జంప
మీకుండక్క మఱియెవ్వరికిని శక్యముగాదు. మీ రిప్పుడే పావ
నులగు హనుమదాదుల నెల్లర రావించి యుద్ధమునకు సంసిద్ధు
లరు గండు."

ఇట్లు బోధింప మారుతాత్మజునిచేం గొంతకార్యము నెఱ
వేఱంగల దని యెంచి రామభద్రుండు హనుమంతునిం దనహృ
దయమునం దలంపం దక్షణమె యాతండు గంధమాదనాద్రినుండి
మనోవేగమునం జనుదెంచి, రామునిపాదములపైం బడి దండ
ప్రణామంబులు గావించి ,,రామచంద్రప్రభూ! సేవకుండ నగు
నేంజేయువలసినకార్యం బెద్దియో సెలవీయవేండెదను. సముద్ర

ములు దావులుపన్నిదాఁటఁగఁజేయుదునో, మృత్యువక్త్రము దాపలిచేత మూయుదునో, కృతాంతుని బట్టితెత్తునో, *కుల పర్వతములు పెల్లగింతునో యానతిత్తురుగాక."

అని పెక్కుభంగుల సంభ్రమింప దశరథనందనుఁడు మారుతనందనుని కరుణామృతలహరులు పర్వ నవలోకించి, "రమ్ము రమ్మ"ని ఱొమ్ము ఱొమ్మునఁ గదియ నాలింగనముఁ గావించి, కుశలం బడిగి పథశ్రమము దీఱ నొక్కహర్మ్యమున విడియ నియమించి పనిచి, యతం డరిగినపిదప విభీషణునిఁ గనుఁగొని, "మహాత్మా! నీచే నెఱవేఱనికార్యము లుండవుగదా?" అని యిష్టాలాపముల నాడి, యారేయి గడపెను.

3

రాముఁడు మఱుచటిదినమునుదయముననెమేల్కాంచిసంధ్యాదిక్రియలునిర్వర్తించిగురుపితృపూజనములుఁగావించి, యగ్నిహోత్రములు దర్శించి, విప్రసహస్రములకుఁ గర్పూరా ♦ద్యష్టగంధములును,తాంబూలంబులు,నొసఁగి,వారిచేనాశీర్వాదంబులు వడసి,భరతశత్రుఘ్న,లక్ష్మణ, విభీషణాదులతోఁగూడ నలంకృతుండై సుమంత్రాదిమంత్రులుగొలువనేకాంతసౌధమునఁగూరు

---

* కులపర్వతములు :—1 హిమవంతము 2 నిషధము 3 వింధ్యము 4 మాల్యవంతము 5 పారియాత్రము 6 గంధమాదనము 7 హేమకూటము.

♦ అష్టగంధములు;—1 కర్పూరము 2 కస్తూరి 3 పునుఁగు 4 జవ్వాది 5 అగరు 6 పన్నీరు 7 అత్తరు 8 శ్రీగంధము.

చుండియుచటికి హనమంతునిరప్పించి యతఁడును, జానును, విభీషణుఁడును, రావణ, కుంభకర్ణ, దేవాంతక, నరాంతకప్రముఖ నిఖిలదానవ మహోద్దండభండనప్రకారంబు లుగ్గడించుకొనుచు, నెడనెడ మారుతిం గొనియాడుచుఁ గొంతప్రొద్దుపుచ్చి, హనుమంతునికి శతకంఠునిప్రకారం బెఱింగింపు మని విభీషణునకుఁ గనుసన్న గావించెను.

అంత విభీషణుఁడు సమ్మదంబున నమ్మరుత్సుతునకుఁ దెలివిపడ శతకంఠునిజన్మంబును, తపోమహిమంబును, జలజజువలన వరములుగొనినతెఱఁగును, మునిదేవతాపహరణంబులును, చతుస్సముద్రలంఘనప్రయాసంబును, పరిఖావిశేషంబును, ప్రాకారప్రకారంబును, ద్వారరక్షకమహాదానవనివహావిక్రమంబును, మంత్రిజనప్రచండత్వమ్మును గరతలామలకంబుగా నెఱింగించిన విని వనచరవర్యుఁడు గగనంబునఁ గుప్పించి గంతులిడుచు రాఘవుని గొనియాడుచుఁ దనచే నంతయు సాధ్యంబగుట మనమున నిశ్చయించి రామున కిట్లనియె.

"రామచంద్రా! నీబంటను నే నుండఁగ నాశతాననుఁ డెంతటివాఁడైన నేమిభయము? మీయనుజ్ఞ యైనచో నే నిప్పుడ చని యానిశాచరు నవలీలఁ బొలియించి వచ్చెద; నది యెట్టులనినఁ, జండికాధవునిచే శక్తియు, జగత్ప్రాణుఁ డైనయస్మజ్జనకునిచే జవసత్వములును, నమరులవలన నజరత్వము, నమృతత్వము, నశ్రమశౌర్యంబులును, మీదివ్యహస్తస్పర్శముచే వజ్ర

దేహంబును, నేఁ బొందియుంటిని; కావునఁ గాలాగ్నినైన నిట్టె పట్టి మ్రింగఁగలను. అట్టిదో నా కాళతకంఠుఁ డవఁగ నెంతటి వాఁడు ?

“ఇదిగాక జలనిధులు దాఁట నలవిగా దని మీ రెంత మాత్రి మెంచవలదు. నావాలముపై సమస్తసేనల నవలీల దాఁటింపఁజాలుదును. ఇది యాత్మస్తవంబుగా నెంచవలదు. మీపాదములాన లే నన్నృతమాడువాఁడఁగాను; మీరు నమ్మిం చినను నమ్మక సుగ్రీవుఁడు మీచే దుందుభికళేబరంబు మీ టించి, సప్తతాళంబుల నొక్కకోలఁ దునియనేయించి యటు మీఁద మిమ్ముల నాశ్రియించెఁగాదే? కావున మీరును నామ హారూపము వీక్షించినఁగాని సమ్మతింపరని యెంచెద.

“తేపు మీపేరఁ జంద్రితారాబలములు గలిగియున్నవి. నేనును నాయందుఁగల బలము దేటతెల్లంబు చేసెద” నని జన వల్లభునిచే ననుజ్ఞవడసి పార్వతీవల్లభుని హృదయమునఁ దలంచి యనేకవిధములఁ బ్రార్థనములు సేయ, నీశ్వరుఁడు ప్రత్యక్షమై “అంజనీతనయా! నీభక్తి యెంతయు మెచ్చఁదగినది. నీ కేమి కావలయునో కోరుకొ మ్మిచ్చెద” ననెను.

అంత మారుతాత్మజుఁడు ,,స్వామీ! నామీఁద దయ గలదేని ప్రళయకాలమున విశ్వరూపముఁ దాల్చునెడ మీయం దెట్టిమహిమము ప్రవర్తిల్లునో యట్టిదుర్నిరీక్షంబగు తేజంబును, విమతశోలీముఖాప్రతిహతత్వంబును నొసంగవే” యని వేఁడుకొ

నటయు భర్గుం ,, డట్లకాక '' యని దీవించి, కైలాసమున
కేఁగెను.

తదనంతర మాహానుమంతుఁడు తనతండ్రి యగు వా
యుదేవునిఁ దలఁప నాతఁ డరుదెంచి పుత్త్రునియెడఁ బ్రసన్నుఁ
డై, యసదృశజవంబును, అభేదసత్వంబును నొసంగి చనియె.

అంత రాఘవుఁ డాంజనేయునిరూపముఁ దిలకింపఁ గోరి
లక్ష్మణవిభీషణాదులతోఁ గొలువు దీర్చి యాహానుమంతుని ర
ప్పించి, తనయుద్దేశముఁ జెప్ప నామారుతియు నత్యంతసంతోష
మొంది తనవక్షమున మాధవుఁడును, ముఖమం దగ్నియు, శిర
మున నమరేంద్రుఁడును, చెక్కుల నశ్వినులును, చరణోరుమ
ధ్యముల సుర, సిద్ధ, సాధ్య, కిన్నర, గరు, డోరగాదిసర్వనిలిం
పులును గన్పట్టఁ దనభారమునకు మహీతలంబెల్ల వణంక విల
యభైరవాకారముం దాల్చెను.

ఇటు లపారగంభీరవిస్తారశరీరుం డగు హనుమంతుని నిరీ
క్షింపఁజాలక, సుమంత్రిప్రముఖమంత్రులును, దక్షిణదొర
లును దలలెత్త వెఱచి భయకంపితదేహులై యుండిరి. లక్ష్మణ,
భరత, శత్రుఘ్నులును, దదీయమహిమాతిశయముఁ గాంచి
యుట్టిట్టని వర్ణింపనేరక నిర్విణ్ణమనస్కులై యుండిరి.

రామభద్రుఁడును నాతనిరౌద్రరేఖావిశేషమునకుఁ బ
రమాశ్చర్యహృదయుఁడై యాతనిసాహాయ్యమున శతముఖునిఁ

దప్పక తుఘుమవచ్చు నని నిశ్చయించుకొని కృపాపాంగంబుల వమృతంబు చిలుక నవలోకంబొనర్చి యిట్లనియె.

"మారుతాత్మజా! మహానుభావా! నీరూపముఁ జూడ నాకే శంక వొడముచున్నయది. తక్కినవారిమాట నిఁకఁ జెప్ప నేల ? దుర్నిరీక్ష మగునీరూపము నిఁక నుపసంహరించి యెప్పటి రూపముఁ జూపవే" యనుటయు హనుమంతుఁడు నిజస్వరూప ముఁ దాల్చి, రాఘవున కనేకవందనము లాచరించి, విభీషణుని చేరువ నిలిచెను, రాముండును మారుతి ననేకవిధములఁ గొని యాడెను.

అంతఁ బవననందనునిఘోరాకారముఁ దిలకించి, మున్ను దన్ను మ్రింగినతనివి దీఱక మరల నిప్పుడు మ్రింగునో యను భయమున నేఁగుకై వడి నినుం డపరాద్రిఁ గ్రుంకెను. రాఘవుఁ డు తొల్లిఁటివలె లవణవారాశి నిప్పు డెక్కడ బంధించునో యిందుండ బాగుగా దని యాకసమునకుఁ బ్రాఁకు బడబాగ్ని శిఖ లన సంజకెంజాయ వొడమెను. ప్రాగ్విధూటి తవనఖపత్రిక రములఁచే విప్పుకొనుకొప్పు నాఁ జీకటి వెల్లివిరిసెను. మరల నానతి నవరించుకొను సొబఁగు దిలకించుదర్పణ మన శశి దోఁచెను.

అంతకుమున్నె రాఘవుఁడు కొలువు సాలించి, సంధ్యా ద్యనుష్ఠానవిధులు దీర్చి, యనిలజవిభీషణులఁ బిల్చి, యాక్ష ణంబ వారునుం దానును, సహోదరత్రియంబును, బంక్తిం

గలసి, *షడ్రసోపేతరుచిరాన్నంబులును, విచిత్రశాకంబులును, •పంచభక్ష్యయుతంబుగా నారగించి, కర్పూరతాంబూలంబులు గైకొని సేవించిరి.

తదనంతరము రాముండు విభీషణు నవలోకించి "మహాత్మా! యిట్టిసమయమునం జతురంగబలములతో నీ వరుదెంచి మత్సహాయుండవై యేతద్దుష్కరకార్యం బెల్లనం దోడంగించి నిర్వహింపు" మని యనర్ఘమణిమయభూషణంబులు, నపారదివ్యాంబరంబులు, ననదృశపరిమళంబులును, నాదరంబున నిచ్చి పనిచె. విభీషణుండు రామునియాజ్ఞ కొడంబడి లంకాపురంబున కరిగె.

పిదప రఘువరుం డాంజనేయు నవలోకించి, యనేకప్రకారముల నాదరించి, తనకంఠమునం గలదివ్యరత్నహార మతని గళమున వైచి "నీవును, లక్ష్మణుండును, గిష్కింధానగరమున కరిగి యేతద్వృత్తాంతమంతయు సుగ్రీవున కెఱింగించి సకలవానరసహితంబుగా నాతనిం దోడితెం" డని చెప్పుటయు వారలిరువు రావెంటనే పయనమై తత్పురంబున కరిగిరి.

అటుపిమ్మట భరత, శత్రుఘ్న, లక్ష్మణులం జూచి "మీరును, కాంభోజ, మలయాళ, కర్ణాట, లాట, కిరాత,

---

* షడ్రసములు :—1 ఉప్పు 2 పులుసు 3 కారము 4 తీపు 5 చేదు 6 ఒగరు.

•. పంచభక్ష్యములు :—1 భక్ష్యము 2 భోజ్యము 3 లేహ్యము 4 చోష్యము 5 పానీయము.

పాంచాల, సౌరాష్ట్రాదిదేశంబులకుం జని యాయారాజులఁ దోడితెం" డని పనిచి రాఘవుఁడు దత్ప్రకారంబులు సీతకు విని పించుచు హంసతూలికాతల్పమున శయనించె.

౮

అంతఁ గొంతవడికి గాల మనుసింహ మాకాశ మనుగజ ముఁ జేరి తత్కుంభమధ్యమును జింప, నందుఁగానిపించు గొప్ప ముత్తియం బన వేగురుఁజుక్క పొడిచె. తదనంతరము,

,, గీ. తారకలు డాఁగెఁ, గుక్కుటధ్వనులు మీఱెఁ
గలువగమి జాఱె, నిరులు మూలలకుఁ దూఱెఁ
గంజములు గేరెఁ, జల్లఁగా గాడ్పు సేరె
దీపతతు లాఱె, బలబల తెల్లవాఱె.

పిమ్మట నంబర మనియెడు కమ్మరీఁడు పూర్వదిశాసాం ధ్యరాగంపుఁగొలిమియందుఁ గాఁగిన లోహంపుముద్దను వెడ లఁజేసెనో యన సూర్యుం డుదయించెను.

అట్టితఱి రఘుకులతిలకుఁ డల్లన వల్లకీమృదులస్వరంబున మేలుకాంచి, కాలోచితకృత్యముల నెఱవేర్చుకొని, గురుమా తృదేవతలకు మ్రొక్కి, విప్రవరులకుఁ గర్పూరతాంబూలాదు లొసఁగి, ప్రమోదమున మణిభూషణములును, మహితాంబర ములును ధరించి, * సప్తాంగయుతుఁడై సింహాసన మధిష్ఠించి

*సప్తాంగములు:—1 కవీశ్వరులు 2 విద్వాంసులు 3 పౌరాణికులు 4 పూర్వకథలఁజెప్పెడివారు 5స్తుతిపాఠకులు 6 హాస్యకరులు 7.గాయకులు.

సకలవానరసైన్యంబు లెవ్వా డరుదెంచు నెవ్వడు శతముఖునిఁ దున్మింతు" నని యాలోచించుచుండెను.

విభీషణుం డట్లు లంకాపురమున కేఁగి తనబంధుమిత్రుల నందఱఁ బిలిచి రామునివృత్తాంతం బంతయు వారల కెఱింగించి యిట్టిసమయమున రాఘవునకు మనము తప్పక తోడ్పడవలయును. కావున సకలసాధనములు సమకూర్చి రథముల నవరించి, గంధసింధురముల నేర్చి, మేటిహరులను, పోటుకత్తులమీఱు నీటుభటులను, నాయితంబులు సేయించి యతిరయంబునఁ దెమ్మని బడవాళ్ళఁ బనిచెను.

ఇట్లు సేనానాయకులఁ బనిచి, నలనీలాదిసత్ప్రధానుల నెల్లర రావించి "వీరాగ్రేసరులారా! దారపుత్త్రభ్రాంతి విడనాడి మీ రెల్ల రిప్పుడే బయల్వెడలి యొక్కొక్కరుఁ డొక్కొక *యక్షౌహిణిసహితముగ రావలయును. ఎంతమాత్రము జాగొనరింపకుఁడు." అని యాజ్ఞాపించెను.

అంత హరుఁడు, నీలుఁడు, సంపాతి మున్నగాఁగల మంత్రులందఱు యుద్ధసన్నద్ధులై ♦ చతురంగబలసమన్వితులై యేకైకమహాక్షౌహిణులతో భేరీమృదంగపటహకాహళధ్వనులు

---

* అక్షౌహిణి—ఇరువదియొక్క వేలు నెనమన్నూట డెబ్బదిరథములు, అన్నియేనుఁగులు, అఱువదయిదువేలు నార్నూటపదిగుఱ్ఱములు, లక్షయుఁ దొమ్మిదివేలమున్నూటయేబండ్రుకాల్వురుగల సేనావిశేషము.

♦ చతురంగబలము— 1రథములు, 2గజములు, 3తురగములు 4పదాతులు.

మిన్నుముట్టఁ జెలంగ వీరాలాపములఁ బల్కుచు నవ్విభీషణుని యెదుటి కేతెంచి గదాముసలప్రాసంబులఁ ద్రిప్పి పట్టసపరితతి యొప్పి సాయకము లేర్చి సంగరసరణి నార్చి పేర్చి నిల్చిన నవ్విభీషణుండును వారల నాదరించి పిమ్మట నిజాభ్యంతరమందిరంబున కేఁగి సకలబ్రాహ్మరాక్షసులచేఁ బఠింపఁబడు ♦ శాస్త్ర *పురా †ణోపపురాణములు వినుచున్న తల్లికి నమస్కరించి రణప్రయాణవృత్తాంతం బంతయు వినిపింప నక్కైకసియు విజయుండవై మరలి రమ్మని దీవించి యక్షత లిచ్చి పనిచెను.

పిమ్మట నాతఁడు తనప్రియసతీమణియగు సరమాదేవి యొద్దకుఁ జని యావద్వృత్తాంతముం జెప్పిన, నప్పరమసాధ్వియు నత్యంతసంతోషమున మందహాసముఁ గావించి దూర్వాక్షత

---

♦ శాస్త్రములు — 1తర్కశాస్త్రము, 2వ్యాకరణశాస్త్రము, 3ధర్మశాస్త్రము, 4మీమాంసాశాస్త్రము, 5వైద్యశాస్త్రము, 6జ్యోతిశ్శాస్త్రము.

* పురాణములు — 1 బ్రాహ్మము, 2 పాద్మము, 3 వైష్ణవము, 4 శైవము, 5 భాగవతము, 6 భవిష్యోత్తరము, 7 నారదీయము, 8 మార్కండేయము, 9 ఆగ్నేయము, 10 బ్రహ్మకైవర్తము, 11 లైంగము 12 వారాహము, 13 స్కాండము, 14 గారుడము, 15 వామనము, 16 మాత్స్యము, 17 కూర్మము, 18 బ్రహ్మాండము.

† ఉపపురాణములు — 1 సనత్కుమారము, 2 నారసింహము, 3 స్కాందము, 4 శివధర్మము, 5 దౌర్వాసము 6 నారదీయము 7 కాపిలము 8 మానవము, 9 ఔశనము, 10 బ్రహ్మాండము, 11 వారుణము, 12 కాళికము, 13 లైంగము, 14 సాంబము, 15 సౌరము, 16 పారాశరము, 17 మారీచము, 18 భార్గవము.

తాంబూలనిచయంబులు దోయిటం గొనివచ్చి నాథున కిచ్చి ,, మనోరమణా! రణరంగమున జానకీరమణునకుం జయంబు సమకూర్చి యరుగుదే’’మ్మని చెప్పి పంప విభీషణుండు సహా స్రఘోటకములు బూన్చినకనకరత్నస్యందనం బెక్కి శంఖారా వంబులు, గజఘోషంబులు, తురగోష్ట్రరింఖాఘట్టనశబ్దంబులు, భూనభోంతరములు మాఱుమోఁయ ద్వాదశాక్షోహిణీచతురం గబలసమన్వితుఁడై లంకానగరంబు వెలువడియెను.

ఇట్లు వెలువడి దినదినక్రమంబున సముద్రంబులును, తటాకంబులును, మహావనంబులును, పర్వతంబులును, ప్రవా హంబులును, దేశంబులును, ఘనతరగ్రామంబులును గడచి సా కేతపురప్రాంతమునకుం జని, తనరాకరామచంద్రున కెఱింగింపఁ గొండఱదానవులఁ బనిచిన వార లేఁగి రామునకు దండప్రణా మంబు లాచరించి యావృత్తాంత మంతయు నాతనికిఁ జెప్పిరి.

రాముం డందుల కానందమొంది బంధుమిత్రామాత్యులు గొలువ నొకభద్రగజంబుపై నెక్కి పురందరాదిదిక్పాలకు లా శీర్వదింపఁ బురంబు వెల్వడి విభీషణునిఁ జేరం జనుటయుఁ బర మభక్తుం డగునవ్విభీషణుఁడు రఘురామునిఁ గాంచి వినయవిన మితోత్తమాంగుఁడై ప్రణమిల్లిన నల్లన రాఘవేశ్వరుఁ డాతనిఁ దనభద్రదంతావళకుంభమధ్యంబునకు రాఁదిగిచి, మణిభూష ణాంబరపరంపర లొసంగి, గాఢాలింగనంబుఁ గావించి, బలం బులు విడియ నొక్కబాహ్యారమ్యప్రదేశంబుఁ జూపించి యా

చ్చట నుండ నియమించి యాతని నొక్కభర్మప్రాసాదంబునకుఁ దోడ్కొనిపోయి యచ్చట నునిచెను.

పిమ్మట రాఘవుం డారాత్రి దేవేంద్రాదిసురలను బ్రార్థింప వార లందఱుఁ బ్రసన్నులై «రామచంద్రా! నీకు వలసినవరం బడుగు» మనిన రాఘవుఁడు ముదం బంది «నేఁ డాదిగ శతముఖుండు మడియుదనుక సకలమనుజ, దనుజ, వనచర, బలంబులకుఁ దృష్ణాహారవాంఛలు వొడమకుండ దయచేయుం» డనిన నట్లకాక యని దీవించి దేవత లంతర్ధానంబు నొందిరి. రఘుకులుండును సుగ్రీవప్రముఖ నిఖలశాఖామృగముల రాక కెదురుచూచుచుండెను.

ఆసమయమున లక్ష్మణుఁడు కిష్కింథానగరముచేరువ నుక్షేమముగా నిల్చి, యనిలజుఁ జూచి « ఓయీ! నీ విప్పుడ సుగ్రీవుదరి కేఁగి మనమిట కరుదెంచుటయు, రాఘవుని యాసతియుఁ జెప్పి సకలవానరసైన్యంబుల నిట కతిశీఘ్రముగ యుద్ధసామగ్రితోఁ దోడితెమ్మని వచింపుము. ఆతఁ డందులకు వెనుదీయునేని నీవు సత్వరము వచ్చి నా కెఱిఁగింపుము. అనంతరకార్యమును నేఁ జక్కఁబెట్టుద.»

అని వచించుటయు హనుమంతుఁ డతిసంతసమున నచట వీడ్కొని కిష్కింధ కేఁగి వానరులు తన్నెదుర్కొని వందనములు సేయ ద్వారంబుఁ జేరి యట శ్రీరామపదధ్యాననిరతుఁడై యున్న సుగ్రీవునిఁ గాంచెను. సుగ్రీవుండును మారు

5

తాత్మజున కెదురుగఁ జని యాతనిఁ గౌఁగిలించుకొని తోడ్తెచ్చి తనయాస్థానమునఁ గూర్చుండఁజేసి "మరియన్నందనా! నాతండ్రి యగు శ్రీరామచంద్రుఁడు సేమంబుగ నున్నవాఁడే? భండనో దగ్రపరాక్రముం డగు లక్ష్మణుం డాతని ననవరతము సేవించుచుం డునే? భరతశత్రుఘ్నులు సేమంబుగ నున్నవారలే? మా తల్లి జానకీదేవి సంతోషమున నుండెనే? రాజసన్మానితుండై వసిష్ఠుండు రంజిల్లుచుండునే?

"మఱియు నో మారుతీ! నీ వీలోన రఘుకులేంద్రుని దర్శించితివే? ఆధారుణీశ్వరునభల విభీషణునివార్త యెన్నఁడైన వినఁబడుచుండునే? మమ్ముల నెన్నఁడైనఁ దలంచుచుందురే?" అని కుశలవార్త లడిగిన మారున్నందనుఁడు చిఱునవ్వు నవ్వుచు సుగ్రీవుని మన్నించి యిట్లనియె.

"రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నలువురుఁ బ్రమదంబున నున్నవారలు. సీతామహాదేవి పతిసేవఁ జేయుచు సేమముగ నున్నయది. గురుం డగు వసిష్ఠుం డురుతరోల్లాసంబున నున్నవాఁడు. విభీషణుఁడు రఘుపుంగవునికడనె మెలఁగుచున్నవాఁడు. నేనును నటనుండియె వచ్చినాఁడను. నిన్నెల్లప్పుడుఁ గౌసల్యానందనుఁ డెన్నుచుండును."

అనిపలుకుటయు నినసూనుం డనిలజు నవలోకించి "మహాత్మా! రావణానుజుఁడు రామునికడనె యుండుటకు నాశ్చర్యంబును, భయమును బుట్టె. అతఁ డెందుల కటు డెంచె? ఏమి

కార్యం బెఱిఁగింపు" మనుటయు హనుమంతుఁడు తనవచ్చిన కార్యం బంతయు నెఱిఁగించి "లక్ష్మణుఁడు మనపురద్వార మునఁ గల యుపవనమునం దున్నవాఁ"డని వచించె.

ఆమాట వినినంతనె తపననందనుఁ డుల్కిపాటునఁ భవ ననందనుని చెంతనుండి లేచి భర్మగృహమున కేఁగి తనప్రియస తీమణియగు తారా [1]కన్యతో నావిధం బెల్లఁ జెప్పి యాంజనే యాదులతోఁ గనకాంబరరత్నభూషణములను గానుకగాఁ బు రోపవనంబునకుఁ దెచ్చి యభివందనములతో లక్ష్మణున కర్పించి "సుమిత్రానందనా! భృత్యుఁడనగు నేను నాసేనాసహితముగఁ గావింపవలసినకార్యం బెద్దియో సెలవీయ వేఁడుకొనుచుంటి" నని సవినయముగ విన్నవించెను.

అంత సౌమిత్రి శతకంఠునివృత్తాంతం బంతయు నాతని కెఱిఁగించి రాఘవుఁ డాదుష్టునిఁ బరిమార్పఁ బ్రతిజ్ఞచేసెను గావున నందులకు నీసహాయంబుఁ గొనవచ్చితిమి. ఇటనిఁక భారం బంతయు నీదె" యని వచించుటయు సుగ్రీవుఁడు మోదం బున సంములకు సమ్మతించి యిట్లనియె.

"దేవా! మీప్రియసేవకుఁడగు నీసుగ్రీవుఁడు నిఖిల వానరచమూసహితుఁడై యుండ దుండగీఁడగు నాశతాన నుండు మిమ్ములఁ జేటిపాటునైనఁ జూడఁగలఁడే? మలయాచ లంబున, మాల్యవంతంబున, హిమవంతంబున, మహేంద్రం

[1] కన్యలు — 1 అహల్య, 2 ద్రౌపది, 3 తార, 4 తార (బృహస్పతి) 5 మండోదరి.

బునఁ, గనకాచలంబున, గంధమాదనంబున ఋశ్యమూకంబునఁ గల వానరబలంబుల నెల్ల రప్పించెద. మీ రీపంచరాత్రిము లిచ్చట నిలిచెదరుగాక" అని వేఁడుకొనుటయు లక్ష్మణుం డాం జనేయసహితముగఁ బంపకడ నుండుట కనుమతించెను.

అంత సుగ్రీవుఁడు బలములఁ గొనితేర సకలకుధరగహ నతలాకంబులకడకుఁ దనయనుచరులఁ బనిచిన వారలు తత్ త్ప్రదేశములకుఁ జని రామునిపదములమీఁద నానవెట్టి యఖిల భల్లూకవానరనివహంబులఁ బిలిచి మరలఁ జనుదెంచిరి.

తదనంతరంబు పది వెల్లువలతో సుషేణుండును, పదాఱు వెల్లువలతో గోముఖ, నీలురును, నవలక్షసైన్యంబుతో జ్యోతి ర్ముఖుండును, తొమ్మిదివెల్లువలతో గవయ, గంధమాదనులు ను, పదివెల్లువలతో శతబలి, గవాక్షులును, మూఁడుకోట్లతో ద్వివిదుండును, రెం డర్బుదములతోఁ బనసుండును, ఎనుబది సహస్రములతో భల్లూకనాయకుండును, పడక్షౌహిణులతో ఋషభుండును, పదునొకండుపద్మములతో వేగదర్శి, తారక, కుముదులును గూడి నానాపర్వతములనుండి చనుదెంచిరి. అవి యెల్లను బండ్రెండు వెల్లువలయ్యె ; కిష్కింధను, ఋశ్యమూకం బుననుగలవానరబలం బఱువదివెల్లువలయ్యె. అన్నియును. డెబ్బ దిరెండు వెల్లువలై ప్రవర్తిల్లె.

౹౹సీ. శతకోటిలక్షలు శైలచరావళుల్
గదిసిన మొన యనఁగాను బరఁగు

మైన లఱువదిలక్ష లనువుగాఁ గూడిన
నది లోకమున బారు వనఁగ నొప్పు
నట్టిబారువలు సహస్రంబు మూఁగిన
నది మహోదళ మన నవనిఁ జెల్లు
దళము లర్బుదమైన దానిపై, రంబర
సంఖ్య యందురు మంత్రిజనము లెల్ల
గీ. నట్టి యంబరములు కోటియైన నొక్క
వెల్లయనఁ దగు, నటువంటి వెల్లలేడు
పదులు రెండును సేవించుభానుసుతుని
నట్టివెల్లను జేకూతె నద్భుతముగ.''

ఎచ్చటఁజూచిన నచ్చోటనెల్ల సేనలు నేల యీనినభంగిఁ గనుపట్టి నిలుచువారును, వక్షస్థలములు ధాలుచల్లు ఘోరసింహనాదము లొనరించుచు మిన్నులుముట్టఁ బెరుఁగువారును, కాలువిధమున వాలము క్ష్మింకించి యూలమున కుద్యుక్తు లగువారును, పర్వతవృక్షములను నిమ్మపండ్లచందమున నలఁతులను బంతు లాడువారును, సాలవృక్షములఁ బెఱికి తెచ్చి పలుమాఱుఁ బిర బిరఁ ద్రిప్పువారును నయి భూనభోంతరాళము లెల్లఁ గపిమయమై యుండె.

అట్టియెడ సౌమిత్రి తద్వానర సైన్యముఁ గని మహాశ్చర్య మొంది, హనుమంతుని జూచి, ''పుణ్యాత్మకా! పుడమిపై నీ కసాధ్యంబగు కార్యం బొందు గలుగునే? ఇన్నియు నొకయెత్తు;

ఇంతకంటె నీ వెక్కుడు; కావున మే మీప్రయత్నమునకుఁ దో
డరవలసె; తేపు పుష్యమి యగుటచే రణయాత్రకీముహూ
ర్తము లెస్స గావున సత్వరము సుగ్రీవుని బయనంబుసేయింపు
ము" అని వచించుటయు నంతలోనె సుగ్రీవుఁ డేతెంచి పావని
తో ముచ్చటించి మరునాఁటియాత్రకు స్థిరపఱచుకొనియెను.
రాఘవానుజుండును బ్రమదంబందెను. కపు లెల్ల రందంద
గ్రిక్కిరిసి విడిసిరి.

అంత సూర్యుం డస్తమించుటయు లక్ష్మణుం డారేయి
సపరాచలంబున జాంబవంతుని రప్పించి యాతనివలన, నదీప్రభా
వంబులును, గిరులమహిమంబులును, దేవదైత్యమహానుభావం
బులును, గపులపుట్టువులును, సముద్రముల తెఱఁగును, సంగర
వర్తనంబులును, ముష్టియుద్ధప్రకారంబును, పెనఁగులాడువిధం
బును, శతకంఠునిగతులును, తదీయమంత్రులచందంబులును,
దెలిసికొనుచుండఁ గొంతవడికి దెల్లవాఱెను.

తదనంతర మర్కతనయుఁడు సుమిత్రాతనయుని సంద
ర్శింప నరుదెంచి, యైరావతముంబోని భద్రగజంబు నొకదాని
నాతని కత్యంతసంతోషమున నొసఁగి తనప్రయాణవిషయముఁ
దారాప్రముఖనిఖిలసతీనిచయంబున కెఱింగించి, వారలచే నను
జ్ఞలు గొని, యంగదముఖానేకపుత్రపౌత్రామాత్యవర్గంబులు
గొలువఁ బురంబు వెడలివచ్చె; లక్ష్మణుండును భానుదత్త
మత్తకరటిఘంటాస్ఫాలనకరుఁడై, హనుమ, జ్జాంబవదాదులు

గొలువ నరుగుదెంచె. సకలదళంబులును, భూచరఖేచరులై రాఁదొడంగిరి.

అంత నమ్మహోజవంబునకు ధరణిరొల్ల దిద్దిరం దిరిగె; భూధరంబు లదరె; బ్రహ్మాదిదేవతలు దలంకిరి. సౌమిత్రి యమ్మహోత్సవము నరసి "సుగ్రీవా! నీకతమునఁగాదె మాకిట్టి వైభవంబు సంప్రాప్తమయ్యె?" ననుటయు రవితనయుఁ డాతనికిఁ బ్రణమిల్లి "రాఘవానుజా! మీరాబంటను, నన్నింతగా నగ్గింపనేల?" యని వచించి యాతనితో నేఁగి దళంబులతో నయోధ్యాపురోపవనంబులఁ జేరెను.

రామచంద్రుఁడు తత్తదాగమనరీతులు చారులచే నెఱిఁగి బంధుమిత్రామాత్యుల నెదుర్కొనఁ బంపిన నర్కసుతుఁడు వారల నెంతయు నాదరించి లక్ష్మణునిఁ గొల్చుచు వారివెంట రాఘవునిసన్నిధి కేఁగి యాతనిపదపద్మములపై వ్రాలి లేచి విభీషణునిఁ గాఁగిలించుకొని, సుమంత్రాదిమంత్రుల మన్నించి రామభద్రు నిట్లు స్తుతింపఁదొడంగె.

"సీ. ఇనకులోద్ధరణాయ! దనుజసంహరణాయ!
రామాయ తే నమో రాఘవాయ!
ప్రవిమలసుగుణాయ! ప్రణుతమౌనిగణాయ!
రామాయ తే నమో రాఘవాయ!
భువనప్రశస్తాయ! భవభయహరణాయ!
రామాయ తే నమో రాఘవాయ!

భండనోద్దండాయ ! దండితవృజినాయ !
రామాయ తే నమో రాఘవాయ !

గీ. రసికజనసార్వభౌమాయ ! రాఘవాయ!
రాక్షసాటవీదహనాయ ! రాఘవాయ !
రామణీయకకృపాత్మనే ! రాఘవాయ !
రామచంద్రాయ తే నమో రాఘవాయ !"

అని యనేకవిధములు వినుతింప రాఘవుండు సుగ్రీవునిం గుఱిచ్చి యాలింగనముం గావించి మిక్కిలి యాదరించె. పిమ్మట రామలక్ష్మణులును, సుగ్రీవవిభీషణ, వసిష్ఠ, సుమంత్రాదులును వానరబలావలోకనాభిలాషులై భేరీమృదంగకాహాళపటవఢక్కా నేకశంఖవేణువీణాదినాదములు చెలంగ రథంబు లెక్కి వచ్చి దక్షిణగోపురం బెక్కిరి.



# తృతీయకాండము



అప్పు డొక్కకపి నింగికి నుంకించి గిరి పైవ నింకొక్కఁడు దానినిఁ బగులఁదన్నుచు, నొక్కవానరుఁడు రవిం బట్ట లంఘింప నింకొక్కఁడు వానిపై నుమిసి నవ్వుచు నొక్కమర్కటుఁడు మహీజములఁ బెకలించి తెచ్చిన నింకొక్కఁ డవి పుచ్చుకొనఁ దీకులాడుచు నొక్కకోఁతి నో రిగిలించి పండ్లు చూపిన నింకొక్కఁడు వానిం గఱచి పరుగిడఁజేయుచు నొక్కతరుచరుఁడు "నే నొక్కండనె యారక్కసు నుక్కణఁగించి వచ్చెద ననుచు నొక్కవనచరుఁ డాశతాస్యు నిక్కడనుండియే నావాలమునఁ జుట్టి తెత్తు ననుచు, నత్యంతోత్సాహమున నుండిరి.

అప్పు డాకపి వర్గంబుల చుబుకములపైఁగల దీర్ఘాభీల రోమములు నాచువలెను. వారలదుర్వారశౌర్యములు గనరానిలోఁతుగను, వారిహుంకృతిధ్వనులు కెరటములమ్రోఁతగను నర్కతనయుని యాజ్ఞావిలంఘనము చెలియలికట్టగను తరుచరులకోపములు బడబాగ్నిగను, వారలనగవులలోనితెలుపు ఫేనముగను, గలిగి విలసిల్లు సేనాసముద్రము నా రామభద్రుఁ డత్యద్భుతముగ వీక్షించి తనమనమున నెంతయు హర్షించి, యత్యంతానురాగమున సుగ్రీవుని మరలఁ గౌఁగిలించి మెచ్చి

యాతని కొకయమూల్యహారముఁ దెప్పించి మిగులఁ బ్రమోదమున నొసంగె.

ఈవిధముగ మన్నించి వెండియు నినజుని వీక్షించి "యర్కనందనా! జ్యోతిర్ముఖుం డెక్కడ? నీలుం డేఁడి? కుముదుం డేడ? గవయుం డెక్కడనుండె? వారల నెల్లర వేర్వేఱ నెఱింగింపు" మనుటయు సుగ్రీవుం డొయ్యనఁ దనకేల నమ్మహీపాలతనయునకుఁ గపులం జూపి యిట్లనియె.

రాఘవేశ్వరా! బహుకపిబలంబులచేఁ గొలువఁబడుచు మహానందమున మాటికి మీముఖావలోకన మొనరించు గంధమాదనుండు వాఁడె. తరుచరులు గంతులిడఁ దనవాలముఁ బీఠముగఁ జేసి మహాగిరింబోలి చలనమొందెడు గోముఖుండు వీఁడె. కపులెల్ల రార్చుచు సభ్రమముట్టఁ బెరుఁగుచుఁ దన్నుఁ గొలువఁ గార్చిచ్చువలె సదుమఁ గూర్చుండినవాఁడు గవయుఁడు సుమా? భూతలము వణంక గిరిత్రయము నేర్పునఁ దనయుఱ చేత నునిచి ఖ్యాతివహించిన జ్యోతిర్ముఖుం డితండె? వాలం బాయినునిపైఁ జాఁచి యాలమున కత్తాడెడు నీలునిఁ దిలకించితివే? సాలయుగ్మంబుఁ జేతఁ గదియించి శతాస్యునిఁ జంప సాహసించు పనసుని గనుఁగొంటివే?

అని యిట్లు సుగ్రీవుం డందఱ వేర్వేఱ నెఱిఁగించుచుండ శ్రీరామచరణారవిందసందర్శనకుతూహలాయత్తచిత్తులై జాంబవంతుండును, మరుత్సుతుండును, గవయ, గంధమాదన, సుషే-

ణాదులును మఱియుఁ బేరెన్నికఁగన్న వనచరులందఱుఁ దమ తమబలంబులతో నచటికరుదెంచిరి.

అంత రాఘవుఁడు హర్షించి వారివారికిం దగుతెఱంగులఁ గనకమణిమయాంగదంబులును, దివ్యాంబరంబులును, విశేషంబుగా నిచ్చి హనుమజ్జాంబవదాదులఁ గరుణాసముద్రంబుల నోలలాడించి బహువిధంబుల మన్నించి బలంబుల నొక్కరమ్యస్థలంబున విడియ నియమించి సుగ్రీవాంగదుల సాకేతంబున నునిచె.

రాక్షసవానరబలంబులును రామునకు దేవతలొసంగిన వరంబునంజేసి తృష్ణాశనంబులవలన నిరపేక్షులై యుండిరి. అంత భరతశత్రుఘ్నులఁ గొలిచి కాంభోజదేశాధీశుం డగు నీలుండును, యవనపతి యగు పృషతుండును, సౌరాష్ట్రనాయకుం డగు సంవరణుండును, బర్బరనాథుం డగు ప్రదీప్తుండును కాశ్మీరరమణుం డగు భరితుండును, మళయాళభర్త యగు త్రిభంగుండును, కోసలాధీశ్వరుం డగు భీముండును, పాంచాలనరుం డగు నీలకేశుండును, విదర్భపాలుం డగు స్మితాస్యుండును, ద్రవిడభర్త యగు సుధీష్టుండును, మఱియు గౌళ, కర్ణాట, పుళింద, లాట, కొంకణ, టెంకణ, మత్స్య, గాంధారరాజులును, చతురంగబలంబులు గొలువ ద్వాదశాక్షౌహిణులతోడ నయోధ్యానగరంబు డాసిరి.

అంత రాఘవుఁడు వారల నందఱ వేర్వేఱ నాదరించి

తగినవిడుదల నుండఁబంచి తానును మరునాఁడు విద్వత్కవిగాయక వసిష్ఠసకలపురోహితభూసురానేకాశీర్వాదములు సెలంగ నుత్సవం బంది సూర్యసిద్ధాంతులచే శుభముహూర్తంబుఁ దెలిసి భేరీమృదంగఢక్కాపణవశంఖాదినినాదములు ఘోరనఁగలంగ భరతాదిసోదరులును, కుశలవాదిపుత్త్రిలును, విజయాదిపౌత్త్రిలును, సుమంత్రాదిమంత్రిలును, విభీషణాదిరాక్షసవరులును, హనుమత్సుగ్రీవజాంబవదాది వానరభల్లూకప్రభువులును గొలువ సకలమనుజ, దనుజ, వనచరసేనామధ్యంబున కరుదెంచె.

ఇట్లరుదెంచి యఖిలశాఖామృగముల రావించి యయిదేసివెల్లువలకు నొక్కొక్కరాజు నేర్పరింపవలె నని కుముద, గవాక్ష, నీల, గవయ, గంధమాదన, గోముఖ, జ్యోతిర్ముఖ, మైంద, ద్వివిద, పనస, ఋషభ, శరభ, నల, గజ, కేసరులను ముఖ్యవానరులకుఁ బదునేగురకుఁ బట్టంబులుగట్టి, వారికెల్ల యుద్ధసమయంబుఁ దెలుప జాంబవంతుని నియోగించి యీదటఁ గాపాడుమని హనుమంతునిఁ బ్రతిష్ఠించి యమ్మహాసేనకు దండనాయకునిగా సుగ్రీవు నభిషిక్తుఁజేసి పట్టంబుఁ గట్టి యువరాజపట్టంబున కంగదుఁ బాటించి యందఱ నొక్కపౌఁజుగాఁజేసి యమ్మహావ్యూహంబునకుఁ జుట్టును రాక్షసద్వాదశాక్షౌహిణుల నుండ నాజ్ఞాపించెను.

పిమ్మట సకలదేశాధిపచమూసముదయంబు నవలోకించి, తద్బలంబు మూఁడుమొనలుగా నేర్పరించి యమ్మూఁడింటికి భర

శత్రుఘ్నలక్ష్మణుల నధిపతులుగా నేర్పఱచి వారికి బాసట
గాఁ బుత్త్రపౌత్త్రాదుల నిలిపి వారికిఁ దోడుగా మత్తమతురం
గసహస్రంబుల నేర్చి వానికిఁ బ్రాపుగా గంధదంతావళంబులఁ
బూన్చి వానికి సహాయంబుగా రథసముదయంబును నిల్పి వా
నికిఁ గావలిగా భటవర్గంబుల నియమించి మఱియు మా
నవవానరదానవసేనల నడిపింప ధైర్యస్థైర్యోపేతుండగు సుషేణు
నేర్పఱచి పిమ్మట నన్నిదళంబులకుఁ దత్తదధినాథులకు రామభ
ద్రుఁడు పట్టభద్రుం డయ్యెను.

అప్పుడు దేవత లత్యంతసంతోషమునఁ బుష్పవృష్టిఁ
గురిసిరి. శంఖభేరీకాహళధ్వనులు మ్రోసెను. ఆమ్మహారవముచే
నాకస మల్లలనాడెను. బ్రహ్మాండమెల్లఁ బటపటఁ బగిలెను.
కొంతవడికి భాస్కరుఁ డస్తగిరిశృంగమున వ్రాలెను.

౨

తదనంతరము రామభద్రుఁడు కాలోచితకృత్యముల
నెఱవేర్చుకొని సంగరమహోత్సాహమున జాంబవంతుని
రప్పించి వానివలనఁ బ్రతాపలంక కరిగెడిమార్గంబును నమ్మా
ర్గమునఁ గల మహిమంబులును హనుమంతుని తెఱంగును నతని
లావును జతురబ్ధిలంఘన మొనరించు వెరవును దెలిసి యమ్మహా
మహునివిడిదికిం బనిచి సీతాగృహంబున కేఁగి యచ్చటఁ
దమ్ములతో నారగించి విడియంబులుచేసి పిమ్మటఁ దమగురుం
డగు వసిష్ఠు నటకు రావించి శతకంఠునిఁ దృణీకరించు వనచర

వ్యూహమహిమంబులును, రాక్షసబలపరాక్రమంబులును, సక
లదేశాధీశులప్రతాపంబులును, వచించుకొనుచుండ నాసమయ
మున సీతామహాదేవి తనజీవితేశ్వరుండగు రఘునాయకుని పలు
కులఁ గరుణారసంబు లొలుకఁ, గటకంట నవలోకించి మృదు
మధురవచనంబుల మెల్లన నిట్లనియె.

"ప్రాణేశ్వరా! తొల్లి పంక్తికంధరునితోఁ బోరునప్పటి
భవదీయబాహుబలపరాక్రమంబులును, బాణసంధానచాతురి
యుఁ, దదుపసంహరణంబులును, రథగతిక్రమము, నుత్తరప్ర
త్యుత్తరములును గడు విచిత్రతరంబు లని చెప్పఁగా విని మఱి
యొకరాక్షసవీరుఁ డెప్పు డుదయించునో మీయుద్ధనైపుణ్య
ము నే నెప్పుడు చూడఁగలుగుదునో యని నిరీక్షించుచుంటిని.
నేటికి నాకోరిక ఫలింపఁగలిగె.

మీరును శతాస్యుఁడును, సంగరరంగమున నేనుఁగు
తోడ నేనుఁగు, మృగేంద్రముతోడ మృగేంద్రము, దవానలము
తోడ దవానలము, నదితోడ నదియు, డాయుకైవడిఁ బోరెడి
విశేషముఁ దిలకించెదఁ గావున నన్ను మీవెంటఁ గొనిపోవ వేఁ
డుకొనెదను."

అనుటయు రాఘవుఁడు తనహృదయమున నాశ్చర్య
మొంది "యీసుకుమారి కీరణవాంఛ జనించుట కేమి హేతు
వో గదా" అని డోలాయమానమానసుఁడై వెండియు నిజాం
గనం గాంచి తదీయశరీరసంజనితతేజోవిశేషంబు మధ్యాహ్న
మార్తాండమండలంబును ధిక్కరించి సకలబ్రహ్మాండంబులఁ

బెక్కుటిల్లఁ జేయుచుఁ దనకన్నుఁగవకు మిఱుమిట్లుగొలుపఁ దల యూఁచి యిట్టిసహాయంబున శతకంఠునిఁ దృణలీల సాధింప వచ్చు నని తలంచెను.

అటుపిమ్మట మరల నాతఁడు జానకినిజాకారము వీక్షించి లోకంబులఁ గలుగు రాజకుమారికాజనములయట్ల భావించుచు మనుజవేషుఁడు గావున నమ్మహామహిమావిశేషములు దెలియ నలవిగాక భరతశత్రుఘ్నలక్ష్మణులమొగములు చూచి వా రును వసిష్ఠుండును వినుచుండ జానకీదేవి కిట్లనియె.

"సీ. చిలుకపలుకులు విని యులుకుకోమలివి దు
ర్వ్యమతార్భటంబులు వినఁగఁగలవె ?
ఎదురెవ్వరాడిన మదిఁగుందుసుగుణవు
పరిత్యర్ధిభాషలు పడఁగఁగలవె ?
వెన్నెలకాఁకకు వెఱచెడియబల వ
త్యుగ్రబాణాగ్నికి నోర్వఁగలవె ?
స్ఫటికంపుసోపానపంక్తుల నొంటిమై
నిలలేవు రథముపై నిలువఁగలవె ?

గీ. ఏల వలికితి వీబుద్ధి యెట్లువుట్టెఁ
గలహాగతు లేడ ? నీవేడ ? గమన మేడ ?
శతముఖునిఁ జంపి వానిదేశమునఁ గలుగు
వస్తువులు నీకుఁ గొనితెత్తు వలవ దుడుగు"

ఇట్లు నాథుం డనుగ్రహింపకుండుటయు జానకీదేవి బా

ష్వారుణితనేత్రయై మోముఱవాంచి నేలపైఁ గాలివ్రేల వ్రాసి కొనుచుఁ బతిమోముఁ జూచుచుఁ బైటచెంగుచే గండసీమ నొత్తుకొనుచు మరలఁ బలుక విభుం డలుకచేఁ బలుకునో పలుకఁడో యని భయమును, భక్తియు, భండనప్రయాణవాంఛయుఁ దనహృదయమునఁ బెనఁగ వసిష్ఠుండును మఱఁదులును సతిమదమున వినఁ గ్రమ్మఱ భర్త కిట్లనియె.

,,ప్రాణకాంతా! భవదీయభుజపర్వతములమఱువునని లిచి మీయుద్ధనైపుణ్యము విలోకించెద; ప్రేయసి నగునాయీ చిన్నకోర్కె మన్నింపకుండుట తగునా?

"చ. అసవరతంబు శోభనగృహంబునకుం, మఖమాచరించుతా
వునకును, సద్వ్రతంబులను బొందుగసల్పెడిసీమకున్ శ్రుతుల్
వినఁజనువోటికిం సకలవిశ్వభయప్రదయుద్ధభూమికిం
వనితలతోడఁగూడి చనవచ్చు టెఱుంగవె ప్రాణనాయకా."

అని మఱియు ననేకప్రకారముల రమణునిఁ బ్రార్థించి పాదములపైఁ బడిన రఘువరుఁ డామెను లేవనెత్తి నిజగురుముఖావలోకనముఁ గావించి, యిందుల కెయ్యది తెఱంగనిన, సకలవిద్యాగరిష్ఠుఁ డగు వసిష్ఠుఁడు నిజతపోమహిమమున భూతభవిష్యద్వర్తమానప్రవర్తనముల తెఱంగు లెఱుంగుఁ గావున జానకీప్రభావముఁ దెలిసి, యమ్మహాశక్తి వలన శతకంఠునిమరణంబును, రామునిజయంబును, నిశ్చయంబుచేసి, యేకాంతమున రామునితో సిట్లనియె.

,, రామా ! ఈరామకోరిక మన్నించి నీవెంట యుద్ధరంగమునకుఁ గొనిపొమ్ము ; అమ్మహామూర్తివలననే తప్పక శతకంఠుఁ డీల్గును ; నీకు జయము చేకూరును ; అది యెట్లంటి వేని యాశతాననుఁడు బ్రహ్మనుగూర్చి తపంబొనరించి పురుల లచేఁ దనకుఁ జావులేకుండ వరముగొనియెను; కావున నభేద్యుం డగు నాశతకంఠుఁడు తప్పక జానకిచేఁ జావఁగలఁడు'' అనిచెప్పి వెండియు నిట్లనియె.

"ఏతల్లికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, దత్సతులును, దాసదాసీజనములుగ నుందురో, ఏసతీమణికి సూర్యచంద్రులు నివాళిపళ్లెరములుగ నుందురో, ఏయమ్మబొనపుటిండ్ల సప్తస ముద్రములుఁ జెలంగుచుండునో, ఏమహాశక్తికి బ్రహ్మాండంబు లెల్ల ననవరతము నాటపట్లుగ నుండఁగలవో, ఏపరమసాధ్వి యూర్పులఁ ద్రిమూర్తులు నుదయంబు నొందిరో, ఏమానినీతి లకం బిజ్జగంబునకు మూలకారణంబో యప్పరంజ్యోతి సీతగాఁ దలంచి యీరహస్యంబు బాహ్యంబుగాకుండ నీచిత్తమందునిచి యస్త్రశస్త్రాధిపతుల నాత్మఁ దలఁచి జానకీసమేతుండవై, యు త్తరఫల్గునీనక్షత్రయుక్తశుభముహూర్తంబున త్రేపురాత్రి జైత్ర యాత్రకు బయలువెడలి శతకంఠుని బరిమార్చి తిరిగి రమ్ము."

అని బోధింప రామచంద్రుఁడు సాంద్రతరాశ్చర్యమాన సుఁడై, సీతాసతీప్రయాణమునకు సమ్మతించి సంభ్రమించు చుండె. వసిష్ఠుఁడును దననివాసమున కరిగె. తమ్ములును, మి

త్రులును దమతమవిడుదులకుఁ జనిరి. పిమ్మట రఘువరుఁడా సుఖనిద్రఁ జెందె.

## 3

పిమ్మట నుషఃకాలమున మంగళపాఠకు లరుదెంచి వివిధ *వీణానాదముల నింపుసొంపుగా భైరవి, మాళవాది♦పురుషరాగములను, దేశాక్షి, దేవగాంధారి మున్నగు †స్త్రీరాగములను సనురాగంబుఁ గావించి, వానిమిత్రంబులు, నయనంబులు, కాలంబులు, లఘుముఖడోలాదివితానంబులు, లవురసౌరవరవంబులును, మధుర, మందర, మధ్యమ తారకంబులును, రాయిస్థాయిరవంబులును, సరిగమపధనిసాదిస్వరభేదంబులును, రూపకాది ‡సప్తతాళంబులును దెలిపి మేలుకొలుపులఁ బాడిరి.

*వీణలు:—రావణహస్తము 2 బ్రహ్మవీణ 3 రుద్రవీణ 4 ఆకాశవీణ 5 పిశాచవీణ 6 సారంగవీణ 7 కూర్మవీణ 8 మహతీవీణ 9 గౌరివీణ 10 కిన్నరవీణ 11 జనకవీణ.

♦పురుష రాగములు:—1 భైరవి 2 మాళవి 3 బంగాళ 4 హిందోళ 5 రాజమంజరి 6 శ్రీరాగము 7 గౌళ 8 భూపాళ.

†స్త్రీ రాగములు:—1 దేశాక్షి 2 ఘూర్జరి 3 దేశితోడి 4 దేవక్రియ 5 ఆందోళి 6 దేవగాంధారి 7 గౌళ 8 గుండక్రియ 9 ఆహిరి 10 లలిత 11 బిలాహరి 12 కుశంజి 13 ధన్యాశి 14 పూర్ణగౌళ 15 వరాళి 16 నాట 17 భల్లాతకి 18 మలహరి 19 సారంగ 20 రామక్రియ 21 కన్నడ 22 మంగళ 23 కాశిక 24 నారాయణి,

‡సప్త తాళములు:—1 ఆది 2 అట 3 జంపె 4 ధ్రువ 5 మఠ్య 6 రూపక 7 ఏకతాళము.

అంత రాఘవుఁడు మేలుకాంచి, కాలోచితకృత్యములఁ దీర్చి, గురుజనభూసురనమస్కారములఁ జేసి, తత్కారుణ్యమున దీవెనలఁ గొని, రణప్రియత్నమున మణికిరీటము మస్తకమున ధరించె. అప్పు డక్కిరీటము పూర్వాద్రిశిఖరమున మహోర్కుఁడువోలె నాతనిశిరమున వెలుఁగొందుచుండె.

ఇదియునుంగాక రామచంద్రుఁడు మఱియు ననేకచిత్రమణివిభూషణపరంపరలును, దివ్యాంబరములును, ధరియించినఁ గనుఁగొని సీతామహాదేవి తనపతివ్రతాధర్మమే తనకు భూషణముగా నెంచి కొండొక [illegible]ంకారములు గైకొనఁ, సమరప్రియాణప్రియత్నమున నుండె.

అంతఁ బ్రహ్మసురులును, సూరలును నుతింప, వసిష్ఠుఁడిదియె సమయ మని నచింప, రాఘవుఁడు రాక్షసలోకగర్భములు వగుల రణప్రయాణభేరి మ్రోయింపఁ జేసి, యంతఃపురమున కేఁగి సీతాసహితుఁడై తల్లులకుఁ బ్రణమిల్లి, వారల దీవనలఁ గొని, భరతశత్రుఘ్నలక్ష్మణాదులతోడను, బుత్త్రపౌత్త్రనిచయంబుతోడను, సకలబంధునివహంబుతోడను, నభిజిన్ముహూర్తమున బయలువెడలి, సుమంత్రాదిమంత్రుల నయోధ్యాపురపాలనమునకు నియోగించి, రాజపురుషమధ్యమునఁ జనుచుండెను.

అట్టితఱి శుభసూచకముగా గౌళి పలికెను. కాకి కఱవి యఱచెను. పూర్ణకుంభద్వయము పొడకట్టెను. ఇరువురు బ్రాహ్మణు లెదురైరి. అశ్వము సకిలించె. గరుడుఁడు కేక

వైచి యాడె. వృషభము అంకెవైచె. గజము ఘీంకారమొన రించె. గాడిద యెలుఁగిడె. మాంసము, మత్స్యములు, మధు ఘటంబు, ఫలములు, సుమములు, పాలు, పెరుగు, నేయి, తేనెయుఁ దారసిల్లె. మందపవమానుఁడు వీఁచె. దేవదుందు భులు మ్రోసె.

అప్పుడు "శ్రీరస్తు శ్రీరామచంద్రా!" యని నిలింపు లాశీర్వదించిరి. "శుభమస్తు సౌజన్యచూడామణీ!" యని విప్రులు దీవించిరి. "సమస్తగ్రహైకాదశస్థానస్థితిఫలమస్తు, సాకేతవాసా!" యని జ్యోతిష్కులు దీవెన లిడిరి. "అభ్యుద యపరంపరాభివృద్ధిరస్తు అవనీశ్వరా!" యని కవీశ్వరు లభినం దించిరి.

అంత రాఘవుఁడు సీతాసహితుఁడై కనకకేతనంబును, షోడశచక్రంబులును, కోటిఘంటికలును, ఘోరశరాసనతూణీర ములును, సహస్రఘోటకములును గల దివ్యరథంబు నెక్కి త్రిపురములఁ గూల్పగౌరితోఁగూడి చనెడి త్రినేత్రునివలె నేఁగుచుండ నాసమయమున భండనోద్దండుఁ డగు భరతుఁడును సంగ్రామప్రచండుఁ డగు శత్రుఘ్నుఁడును, దళితారిప్రభం జనుఁ డగు లక్ష్మణుఁడును, రిపుగజాంకుశు లగు కుశలవులును మఱియు ననేకులు వీరాగ్రేసరులును జయనమై చనుచుండిరి.

ఇవ్విధమున రాజపరమేశ్వరుఁ డగు రామచంద్రుఁడు సాంద్రికశామహిమంబునఁ బూర్ణిమాచంద్రుని ధిక్కరించుచు

సకలసన్నాహంబునఁ బట్టనమధ్యమునఁ గదలునప్పుడు మేఘము చెంత మెఱపువలెఁ జెలంగుచున్న జానకీదేవి నీక్షించి, మించిన సంతోషమున నప్పురపురంధ్రీజనములు గుంపులుగూడి సీతాస తీసౌందర్యమున కచ్చెరువొందుచు ననేకవిధములఁ గొనియాడ సాగిరి.

ఇట్లు పురసతు లభినుతింప రామభద్రుఁడు సంభ్రమ మునఁ బొద్దుగ్రుంకుసంతకు సాకేతపట్టనప్రాకారద్వారములు గడచి కరదీపికాసహస్రములతో సకలరాక్షసవనచరమనుజసేనా మధ్యమున కరిగి యచట విభీషణకల్పిత మగుపటకుటీరమున విడిసె.

భరతశత్రుఘ్నలక్ష్మణులును, కుశలవాదితనయులును, విజయాదిపౌత్రులును, రాఘవునిచుట్టును విడిసిరి. వారికిఁ బ్రా పుగా ద్వాదశాక్షౌహిణులతో సకలదేశాధిపులు నుండిరి. వారికి రక్షకుఁడై సుగ్రీవుఁడు డెబ్బదిరెండువెల్లువలతోఁ బరివేష్టించి యుండె.

తద్బలములకు వలయాకారముగా విభీషణుఁడు తనసేన లతోఁ గాఁపయ్యె. అన్నిబలములకు హనుమంతుఁ డధ్యక్షుఁడై తద్బలంబులకు రసాతలంబును, నక్షత్రమండలంబును ముట్ట నా భీలముగ వాలము పెంచి వాటముగాఁ గోటఁ జేసి ద్వారప్రదే శమున మృత్యువుంబోలి కడంగియుండె.

అఖిలజీవంబులుఁ దమతమమనులకుఁ జేరె. అట్టితఱిఁ భే

రీమృదంగాదితూర్యఘోషములును, సకలసైనికసింహనాదము లును, సమస్తహయహేషారవములును, గంధసింధురబృంహిత ధ్వానములును, రథనేమినిష్ఠురస్వనంబులును, భల్లూకఘుర్ఘుర ధ్వనులును, కార్ముకగుణటంకారంబులును, పుంఖానుపుంఖం బులై యొక్కపెట్టున సకలబ్రహ్మాండకోటరంబులు ఘుమఘు మాయమానంబులుగా నిండి విలయకాలమున బడబానలము ఖుంబులకు నులికి మొఱవెట్టు సప్తార్ణవముల ననుకరించె.

అది ప్రళయసమయంబునుంబోలె విభీషణప్రగల్భంబై, సంగ్రామవర్తనంబునుంబోలె శత్రుఘ్నప్రశస్తంబై, నాట్యం బునుంబోలె భరతకలితంబై, పవిత్రస్థలంబునుంబోలెఁ గుశాభి రామంబై, భారతరణంబునుంబోలె విజయప్రసిద్ధికరంబై, సరో వరంబునుంబోలె నీలకుముదసంశోభితంబై, శృంగారవనంబునుం బోలెఁ బాటలపనసరంభాలంకారంబై, అలకానగరంబునుంబోలె సకలరాజసంచయంబై యుండె.

౪

సూర్యోదయంబయ్యె. తత్పూర్వమె రాముఁడు సం ధ్యాదిక్రియలు దీర్చి, గంధమాల్యాంబరాభరణములు ధరించి విభీషణ, సుగ్రీవాంగదహనుమత్ప్రభృతుల రావించి వారివా రికిఁ దగినకట్నములును, భూషణములును, ముదముతో నొ సఁగి, యుగ్గాగ్నేయముహూర్తమున సేనల నడుమ నిర్యాణపుఁ

డని సుషేణునిఁ బిలిచి మన్నించి మార్గముసూప నియమించి, తనతమ్ముల నవలోకించి కుశలవవిజయులును మీరును సకలన్పృపతులఁ గదలింపుఁడనిన వారలును దమతమబలముల కెల్లఁ జాటింపఁజేసిరి.

అంత సకలసైన్యములతో నిఖిలదేశాధిపతులును గరవాల, ముసల, ముద్గర, పట్టిస, ప్రాస, త్రిశూల, గదా, పరిఘా, భిండివాల, కఠార, కుఠార, ధనుర్బాణములు గైకొని, గజహయాందోళనస్యందనబృందముల నెక్కి, ఛత్రచామరాది నానాలాంఛనములు మెఱయ, భేరీ, మృదంగ, శంఖ, పణవాద్యనేకవాద్యములు మొరయ నేల యీనినతెఱఁగున భూమియందును, వియత్తలమందును, పర్వతములయందును, తటాకములయందును, దిక్కులయందును, బట్టుచాలక యొనుబదియోజనములపొడవును వెడల్పును గలిగి నిరంతరంబుగా సకలబలంబులు నడువంజొచ్చె.

భరత, శత్రుఘ్న, లక్ష్మణ, కుశలవ, విజయాదులును, విభీషణసుగ్రీవాంగదులును, నఱువదినహస్రములతో రామచంద్రునిఁ బరివేష్టించియుండిరి. అంత హనుమంతుఁ డవక్రపరాక్రమమునఁ గులగిరు లులికిపడునటుల హుంకరించుచు నేతెంచి మహాగాంభీర్యస్వరూపముతో రామునిముందఱ నిలిచెను.

దశరథాత్మజుఁ డాంజనేయు నత్యంతప్రేమమునఁ గౌఁగిలించుకొని, ,,మారుతీ ! మనసేనల నెల్ల నొకదరిఁ జేర్చి నీవె

సమర్థుఁడ వని నే నెంతయు నమ్మియున్నవాఁడను. నీ వప్రమత్తుఁడవై యీకార్యముఁ గొనసాగింపవలయును." అని వచించి సీతతో రథము నధిరోహించెను. పవనజుఁ డారథముఁ దన శిరోమధ్యమునఁ దాల్చెను. సురలు విరులవానఁ గురియించిరి.

భరతలక్ష్మణశత్రుఘ్నులును, కుశలవాదిపుత్త్రులును, విజయాదిపౌత్రులును, సుగ్రీవవిభీషణాదులును హనుమంతుని భుజములమీఁదను, వీఁపుపైని నిలిచిరి. తక్కినవేన లందఱు పద్రపైకిఁ జీమలెగఁబ్రాఁకువిధమున నతనిపై కెక్కుచు, సంతోషమున నుండిరి.

ఇట్లు విజృంభమాణుఁడై యాంజనేయుఁడు వారలఁ గొని చనిన, భేరీమృదంగ, కాహళ, కఠోర, భూరిరవంబులు సెలంగ రాముండును, గ్రహంబులలోనఁ బ్రకాశించు భాస్కరబింబంబునుంబోలె సకలసేనలలోనఁ దేజరిల్లుచు, రవి కుంతు సంతతుఁ దమసానదీతీరమున విడిసి, మఱునాఁ డచ్చటు వీడ్కొని, సుషేణుఁడు ముందఱ నడువఁ గ్రమక్రమమున మహావనంబులును, తటాకంబులును, పర్వతంబులును, దేశంబులునుం గడచి, త్రిజగద్భయంకరముగా క్షీరసముద్రాభిముఖుఁడై రాఁ దొడంగె.

ప్రతాపలంకయందు శతకంఠుఁడు సకలపురోహితామాత్యబాంధవరాక్షసలోకంబు గొలువ, నిఖిలామరదిశారమణసముదయంబు సేవలుసేయ నభ్రంకషసింహాసనమునఁ బేరోలగం

టుండెను. అంతటఁ జారు లేతెంచి రాక్షసేంద్రునిచరణములకు జోహారు లొనరించి, సభవా రందఱు విన నాతని కిట్లనిరి.

దానవసార్వభౌమా! దేవరయాజ్ఞానుసారము మే మా యూతావుల కేఁగి విశేషముల నరయుచుండ నొక్కయెడ నొక విచిత్రము గానవచ్చె. అది యెద్దియన? రావణునిసంహరించిన మహావీరుండగు రాముం డనేకసైన్యములతో మీపై దాడి వెడలి వచ్చుచున్నవాఁడు. మున్నిట్టివానరగణములఁ జెప్ప వినాఁరము గాని వానికన్న నెన్నియో మడుంగు లధికముగ నున్నయవి.

పెక్కుమాట లేల? వర్షధారలనైనఁ, దారాగణమునైన, నిసుకరేణువులనైన నెన్నవచ్చును గాని యీరామునిబల ముల నెన్న నలవిగాదు.

అందు హనుమంతుఁ డనువాఁడు మేరుగిరివలెఁ బెరిగి సేనల నన్నిటి నెత్తుకొని మృత్యువుకై వడి నిట కరుదెంచుచున్న వాఁడు. చెప్పిన దేవరవారి కెక్కడఁ గోపమువచ్చునో యని భయ మగుచున్నది గాని, యమరులుఁగూడ నప్పవనజు నెదిరింప నోప రని మాకుఁ దోఁచెను.

మే మెవ్వరికిని గనఁబడకుండ నొకయెడ నిల్చి యవ్వీరుల నరయుచుండ, నందొకకపి కొండ్రొప్పన నార్చుచు నొకపర్వతమును జేతికితెచ్చి యఱకాల రాచి చూర్ణముఁ గావించెను. వాని కికోటలు, నీదానవులుఁ దృణప్రాయములుగా మే మెంచి

తిమి. మీరిక్కార్యం బెట్లు సాధింపఁగలరో యని మేమెంతయుఁ జింతించుచున్నారము.

మఱియు నాసేనకు సుగ్రీవుఁ డనెడివాఁడు నాయకుఁడుగ నుండెను. లక్ష్మణుం డనెడివాఁడు మిమ్మాజిలో నవలీలఁ బొలియింతు నని తనయన్నతో సారెకు వచించుచుండెను. భరతశత్రుఘ్ను లనువార లత్యంతోత్సాహమున మీతో రణ మొనరింప నువ్విళ్ళూరుచున్నవారు. కుశలవు లనువారలు తమతండ్రి యగురాముని గొలుచుచు సంగ్రామమున కెదురు చూచుచుండిరి. మనవిభీషణుఁ డారాముని సేవించుచు మిమ్ముల నాతనియొద్ద దూషణచేయుచు, దుర్భాషలచే మీమర్మకర్మంబుల నెల్ల నాతని కెఱింగించుచు, విలయరుద్రునికై వడి వచ్చుచున్నవాఁడు.

ఇవి యన్నియు నట్లుండ, మే మింకొకవిశేషముఁ దిలకించితిమి. మేఘముచెంత మెఱుపువలె నారామునిముందఱ సీత యను నొకకాంత వెలయుచున్నది. ఆసతీశిరోమణిసౌందర్యాతిశయము లే మని విన్నవింపఁగలము?

పూర్ణిమాచంద్రుని హసించు మొగము, చంపకము నిరసించు నాసికము, అద్దముల మీఱు చెక్కులు, దాడిమీ బీజముల గేరు రదములు, శంఖమును బోలు కంఠము, సింహము నేలు నడుము, శ్రీకారములఁ బోలు చెవులు, కలువల నేలెడి కనులు, మేఘములఁ బోలు కురులు, చివురుల నేలు

పదములు, లేనెఱందలపించు నుదురు, కలువతూండుల నొంచు
బాహువులు, చుక్కల నెక్కిరించు గోళ్లు, తాబేళ్ళఁ దబ్బిబ్బొన
రించు మీఁగాళ్లుఁ గలిగి యాయింతి చిలుకవలెఁ బలుకుచు,
మత్తకరివలె నడచుచు వచ్చుచుండెను."

ఇట్లు చారు లెఱిఁగింప శతముఖుఁడు కోపారుణితనేత్ర
నుండై, తనకనుసన్న యెఱిఁగి పనులు సల్పెడి యష్టదిక్పాలకు
లను, వారివారిదిక్కుల కనిచి కొలువు చాలించి యంతిపురి
కేఁగెను.



# చతుర్థకాండము

౧



శ్వేతకంతుఁ డంతిపురసౌధమధ్యసింహాసనమునఁ గూరు చుండి తనమంత్రుల రావించి యుచితాసనంబులఁ గూర్చుండఁ జేసి, వారలతో నిట్లు సంభాషింపఁదొడఁగెను.

"అమాత్యవరులారా! రాముఁడను నొకభూపాలుఁడు నాతో రణ మొనరింప ననుజ, తనుజ, బాంధవ, తరుచర సహితుఁడై యరుదెంచుచున్నవాఁడఁట! వారి నందఱను హనుమంతుఁ డనువానరుఁ డొక్కఁడు గొనివచ్చుచుండెనఁట! విభీషణుఁడు మనమర్మకర్మంబు లెల్ల నెఱిఁగించుచుఁ, జతురంగబలములతో నారామునిపజ్జనె యరుదెంచుచున్నవాఁడఁట! ఇట్టితఱి మన కేది కర్తవ్యమో మీర లెల్లరు బాగుగ యోజించి చెప్పఁ గోరెద" ననెను.

అంత మంత్రులు చిఱునవ్వు నవ్వి "దానవేశ్వరా! యుద్ధ మెవ్వరితోడ సంప్రాప్త మగునో యని మేము మాహృదయముల నెల్లప్పుడుఁ దలంచుచుంటిమి. సెలవైనచో మే మిప్పుడ యానరవానరాదులఁ బట్టుకొని నలిచివైచి, కులపాంసనుం డగు నవ్విభీషణునిఁ జంపి, హనుమంతునిఁ జక్కఁజేసి, రాముని సతి యగు సీతను గొనితెచ్చి దేవరకు సమర్పింపఁగల వారము."

అని యిట్లు ప్రగల్భవచనముల దనుజేంద్రునిమనసు రం
జిల్లఁజేసి, మఱియుఁ బెక్కుచందంబుల గదలు సాఁచుచుఁ, బరి
ఘంబులు ద్రిప్పుచు, ముసలంబు లూఁచుచుఁ, బరశువు లెత్తు
చుఁ, దోమరంబులు సూపుచుఁ జాపంబులఁ గుణధ్వనులు గా
వించుచు, శరంబు లేర్చుచు, మిన్ను వగుల నార్చుచు, ననేక
రాక్షసులతో సమరంబున కఱ్ఱాముచు నిల్చిరి.

అంత శతకంఠుఁ డత్యంతాశ్చర్యసంతోషముల నంది,
వెంటనే యగడ్తలు చక్కం జేయించి, రసాతలంబుముట్ట జలం
బు నింపించి, నవప్రాకారంబులు సవరింప నియమించి, సకల
ద్వారములఁ గార్చిచ్చులం బోలిన దానవులఁ బదికోట్ల నుంచి,
మొగసాల నఱువదిలక్షలతో నుండు మని స్థూలకంఠుని నియో
గించి, తననగరము కిన్నర, గంధర్వ, సిద్ధ, విద్యాధర, గరుడ,
నిర్జర, పన్నగాదుల కభేద్యంబుఁ గావించి, కొలువు సాలించి,
ప్రధానులఁ బంచి, తానును దనతల్లి యగు చిత్రగంధిపాలికిఁ
జని, తద్వృత్తాంత మంతయు నామె కిట్లు చెప్పఁదొడంగెను.

"జననీ! రాముం డనువాఁడఁట; నాతో రణమొనరింప
నెంచి కోఁతిమూఁకతోఁ జతుస్సముద్రములు దాఁటివచ్చుచు
న్నవాఁడఁట; ఆహాహా! కార్చిచ్చుపయి శలభవ్రజము పడఁగ
డంగుట యిట్టిదేకదా? తొల్లి రావణుఁ డారామునిసతినిఁ బట్టి
తెచ్చి సుఖమందకయె సురిక్కె. ఇప్పు డారాముఁడు మరలఁ
దనతరుణిని వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాఁడఁట. నే నిప్పుడ

యప్పుడమిత్తేని పుడియించి గూపడఁతినిఁ గొని తెచ్చి శాశ్వతముగ సుఖమందెదను.”

ఇట్లు తనయుఁ డాడినమాటలు విని చిత్రగంధి తనహృదయవీథి నెంతయుఁ గుంది, ,, పుత్త్రికా! నీ కిట్టిదుర్బుద్ధి యేలఁగలిగె? సీతాసతి నీకు మాఁగదా? నీ విట్టిపాపకార్యమునకుఁ గడంగుట తగునా? ఇదియునుఁగాక రాముఁ డన నెవ్వఁ డను కొంటివి? *విష్ణుదేవునియవతారముగదా. సీత రమాసతి గాదా? రామునితోఁ బోరి కాదె మనరావణాదిముఖ్యదానవు లెల్లరు నశించిరి.”

అని యనేకవిధముల రామునిమహిమయు, నాతఁ డవతారములు పలువిధములును నెఱిఁగించి వెండియు నిట్లనియె. ,,రాఘవుఁడు కేవలమానవుఁ డని నీ వెంతమాత్ర మెంచవలదు. ఆతఁడు పూనుకొనిన వార్ధులు గోటలు నన నెంత? నివ్వమాత్రె మొకలెక్కయా? ఇదిగాక పద్మభవునివరములఁ దలఁచి నీవు గర్వపడఁబోకుము. ఆసృష్టికర్తను సృష్టించుదిట్ట డితఁడు గావున నాతనియాపు లెందుకును బనికి రావని నమ్ముము.

“నీవొకవేళ వరంబు లనుకూలంబు లగు నని తలంచి

* విష్ణునియవతారములు:— 1 మత్స్యావతారము, 2 కూర్మావతారము, 4 వరాహావతారము, 4 నరసింహావతారము, 5 వామనావతారము, 6 పరశురామావతారము, 7 రఘురామావతారము, 8 బలరామావతారము, 9 బుద్ధావతారము, 10 కల్క్యవతారము

సను నీవు విరించిని గోరునపుడు పురుషులచేఁ జావులేకుండ నడిగితివి గాని సతులఁ దలంపనేర వైతివి. అది యెల్లప్పుడు నా హృదయమునఁ దవిలియుండు ఇదియునుఁ గాక రాముఁడు సీతా సహితుఁడై యరుదెంచుటకుఁ గారణ మేమొకో యెఱుఁగరాదు. ఆయమ్మ మహామాయ గాని సామాన్యమానవకామిని గాదు.

„కావున నో తనయా ! నీ ప్రయత్నము మాని పురాణపురుషుఁ డగు నారామచంద్రుని కెదురుగాఁ జని శరణు జొచ్చి బ్రదుకుట ముఖ్యకర్తవ్యము.”

అని పెక్కు తెఱఁగుల బోధింప రోగికిఁ బథ్యంబు రుచింపని తెఱఁగున నమ్మాటలు చెవిం బెట్టక శతాననుఁడు దిగ్గన లేచి చని సమరప్రయత్నమున నుండె.

రఘురాముఁడును నక్షత్రములనడుమఁ జెలువొందు సంపూర్ణచంద్రుని ధిక్కరించుచు సకలసేనామధ్యమున రాఁదొడంగె. అట్లు వచ్చివచ్చి క్షీరసముద్రతీరంబుఁ దోరంబుగాఁ జేర మారుతనందనుండు సంతుష్టాంతరంగుఁడై తనశిరోభాగంబున, వీపుం దేహంబున నుండిన రాఘవసీతాదులను భరతశత్రుఘ్నులను, లక్ష్మణవిభీషణులను, సుగ్రీవాంగదప్రముఖుల నందఱను డించి, రఘువరునకుఁ బ్రదక్షిణముఁ గావించి, నమస్కరించి పురోభాగమునఁ గరములు మొగిడ్చి నిలుచుండెను.

అంత రాఘవుఁ డాంజనేయు నవలోకించి తననయనం

బుల హర్షకరుణా*రసములు దొరుఁగ సుసమధురవచనంబుల నిట్లనియె. "మారుతీ! నీమాహాత్మ్యం బేమన వచ్చును? మేము నీ ఋణం బేమి యొసఁగి తీర్చుకొనఁజాలుదుము ?" అని యనేకప్రకారములఁ గొనియాడెను.

పిదప సీతాదేవి తనవిభునిచెవి సోఁక నాంజనేయునితో నిట్లనియె. "అన్నా ! మరుస్సందనా ! ఆదినమున నట్లు వనములోఁ గఠినదానవస్త్రీలఁ గాపువెట్టి దుష్టుండగు రావణుఁడు న న్నెంతయు శోకనొందింపఁజేయ నే నస్మత్పతిని బాసినదుఃఖమున వ్రాలి దేహమును మఱచి ప్రాణములఁ గోల్పోవనున్న సమయమున నీవచ్చటి కరుదెంచి రాఘవుని జయముఁ జెప్పి జీవనములు నిల్పి, రక్కసు నుక్కణఁగించి పతిని గూర్చెద నని ప్రీతి నలఁజేసి, తిరిగి చని విభునకు నే మనుటఁ జెప్పి యబ్ధి బంధించి సైన్యములఁ గొనితెచ్చి శాత్రవుల సంహరింపఁజేసి విభీషణునకుఁ బట్టంబుఁ గట్టించి నన్ను నాప్రాణవిభునితోఁ గూర్చితివి. నీవంటిప్రాణబంధుఁ డింకొకఁడు మాకుఁ గల్గునే?" అని మిక్కిలి వినుతింపఁదొడఁగెను.

అంత మారుతాత్మజుఁడును రాఘవేంద్రునకు, సీతాదేవికి వినయపూర్వకవినతు లర్పించి "మీమహిమాతిశయం

* రసములు—శృంగారరసము, 2 హాస్యరసము, 3 కరుణరసము, 4 రౌద్రరసము, 5 వీరరసము, 6 భయానకరసము, 7 భీభత్సరసము, 8 అద్భుతరసము, 9 శాంతరసము,

బునఁగాదె నే నెల్లభారములుఁ దరింపఁగలిగితిని ? మీయానతి యైనచో నెట్టికార్యములేని సాధ్యములు గాకుండునే? నేనిప్పుడ చతురబ్ధులపై వాలంబుఁజాఁచి యందుపై మనసేనల నెల్ల నడిపించెద" ననుటయు రాముం డద్భుతానందనిమగ్నుఁడై "మారుతీ! నీవు గల్ల మాకేమి కొదవ ? నీవు సేనల నెల్ల నొక్కదరిఁ జేర్పుము, అవ్వలికార్యం బెల్ల నేఁ జక్కఁబెట్టెద" ననెను.

౨

అంత మహాబలవంతుఁ డగుహనుమంతుఁ డభ్రము నోఁకఁ దనువుఁ బెంచి దిగంతవిశ్రాంతయశస్సాంద్రుఁడై, కృతాంతునిపోలిక నంతకంతకుఁ బంతమున ధిక్కరించుచుఁ దనవాలము యోజనశతద్వయంబుపొడవును, నేఁబదియోజనములవెడల్పునుం గలుగ నిక్కించి కలశాబ్ధిపైఁ బఱపి బ్రహ్మమహేంద్రులును, గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస, కిన్నర, కింపురుష, సిద్ధ, విద్యాధర, బృందంబు లందంద నవలోకించుచు నక్కజంబుగాఁ బెక్కువిధముల నుతింప నిల్చెను.

మఱియు నమ్మారుతాత్మజుఁడు గదాహస్తుఁడై మేరునగముచందమునఁ దత్తీరంబునఁ దోరంబుగాఁ గదలక నిల్చి చెలంగుచు నెల్లదళములఁ గదలుం డని పెద్దయెలుఁగునఁ బలుక రామభద్రుఁడు మహాశ్చర్యమున సీతమొగంబును, లక్ష్మణుని దిక్కును జూచుచు ననేకవిధముల వినుతించుచు సుగ్రీవాంగద

జాంబవత్సుషేణాదులు ముందఱఁ దోఁకపైవీఁక నడువ జానకీసమేతుఁడై పుత్త్రపౌత్త్రసహోదరనిచయంబు పరివేష్టించి యరుదేర జయజయధ్వనులతోఁ జనుచుండె. వెనుకొని సకలదళంబులు రాఁదొడంగె.

ఆసమయమునఁ గొందఱు కపులు వననిధియందు గుభుల్లున నుఱికి చల్లులాడుకొనసాగిరి. మఱికొందఱు వానరులు గగనమున కెగసిరి. హనుమంతునివాలముపైఁ గొంద ఱేఁగిరి. రథగజతురగాదివర్గంబులెల్లఁ దద్వాలంబుపై నిశ్శంకముగా నరుగఁజొచ్చెను.

రామభద్రుఁడు చేయిసాఁచి సీతకు మీనకర్కటకచ్ఛపాదులఁ జూపుచుఁ దమ్ములును సకలసైన్యములును గొలుచుచు నరుదేర క్షీరసముద్రము దాఁటెను. అంత హనుమంతుఁడు సైన్యమెల్లఁ దీరముఁ జేరినసంగతి నెఱింగి తనతోఁక మెల్లఁగఁ దీసి లేచి చేరువ నున్న పర్వతముపై కెక్కి కుతలంబు వడంకనార్చి, వాలంబుఁ గదల్చి బాహువుల జళిపించి యంఘ్రులు గూడఁగఁబెట్టి రాఘవునిఁ దలంచి రెక్కలతో నొప్పెడి యమరాద్రికై వడిఁ గుప్పించి దాఁటి రఘురామచంద్రునిసన్నిధిని నిల్చెను.

అప్పుడు రాముం డత్యంతసంతోషమున నాంజనేయునిఁ గౌఁగిలించుకొని దీవించి సకలసేనాసమేతుఁడై నాఁటి కచ్చట నిల్చి మఱునాఁడు ఘృతసముద్రంబును, మూఁడవనాఁడు దధి

నిధియును, నాలుగవనాఁడు సురాంభోనిధియును, క్రమక్రమ
మున హనుమదాఖిలవిశాలవాలముపైఁ గడచి జానకీసహిత
ముగఁ బవనసుతునిశిరోమధ్యంబున రథంబుపైఁ దేజరిల్లుచుఁ
బ్రతాపలంకాపై భవనముల నవలోకించుచుఁ జనుచుండెను.

అంతట బలంబు లన్నియు నరుదెంచి సకలదిక్కులయం
దును, బిక్కటిల్లుచు, భూనభోమధ్యంబున దట్టముగా నిండి,
శతకంఠునిపురంబు డాసి, కాహళ, మృదంగ, ఢక్కాముఖబ
హువిధతూర్యనాదంబులు భోరుకలంగ, మనుజ, దనుజ, శా
ఖామృగ, వాహినీసమూహములతో రఘునాయకుండు విడిసె.

బలంబులునుఁ దగినయెడల నుండిరి. విభీషణ, సుగ్రీ,
వాంగద, ముఖ్యులు రామునిచేరువ నుండిరి. భరత, శత్రుఘ్న,
లక్ష్మణ, కుశలవ, విజయాదులు సేనాసమేతంబుగా సీతం బరివే
ష్టించి రామునిఁ గొలిచి యుండిరి.

రఘువరుండును ప్రతాపలంకాపట్టనంబు నెట్టన ముట్టడి
వేయ నూహించి విభీషణసుగ్రీవాంగదజాంబవన్మరున్నందనాను
జానుమతమున ననేకవానరబలంబులతో దక్షిణద్వారమున నం
గముండును, నూఱుకోట్ల కూర్రభల్లూకంబులతోఁ బడమటిగ
వనియందు జాంబవంతుండును, నూఱర్బుదముల వనచరులతోఁ
దూర్పుదెస గోముఖ, పనస, వృషభ, శరభులును, మిగిలినసై
న్యములతో నుత్తరంబున సుగ్రీవుండును, విభీషణునిఁ గొలిచివ
చ్చిన దానవు లెల్లరుఁ గొమ్మకొమ్మ కొక్కొక్కరుగానుండుట

కును, వారలను బ్రిధానులు గాఁచుచుండుటకును, వాహిను లల్పములైనతావుల నెల్ల భూవరు లరయుచుండుటకును నియమించెను.

ఆసమయమున వందలు నన్నిదిక్కులఁ గాఁచుకొని కొంద ఱగడ్తలు పూడ్చువారును, గొందఱు కొమ్మలఁ గూల ద్రోయువారును, గొందఱు కవాటములభేదించువారును, గొందఱు బ్రహ్మాండములు వగుల నార్చువారును నయియుండిరి.

శ్రీరామచంద్రుఁడు యుద్ధకుశలుండగు విభీషణునిప్రోత్సాహమున మారుతిం బిలిచి,

,,ఆంజనేయా! నీసహాయమున మేమును సేనలును నిచ్చటఁ జేరఁగలిగితిమి. ఇటమీఁదఁ గార్యంబెల్ల నేఁ జక్కఁబెట్టెద గాని నీ విప్పుడు ముందుగ రాయబారిగ నేఁగి యాశతకంఠుని బుద్ధి యేవిధముగ నుండెనో తెలిసికొనివచ్చుట మంచిది. కావున నీవటకుఁ జని యాతనికి మ మ్మెఱిఁగించి, బ్రహ్మ యొసఁగినవరముల కెంతమాత్రము గర్వింప వల దనియు, నాచే దగ్ధులైన దశముఖాదిదైత్యులఁ దలఁపు మనియుఁ, దనకుఁ బురుషులచేఁ జావు లే దని యాతఁ డొకనేళ నవియె నేని నే నిచ్చటి కరుదెంచినవిధముఁ దలపోయు మనియు, దురహంకారమును దూరముచేసి శరణుసొచ్చుట మేలనియు, నట్లు శరణనినచో ధరణీసుతాదుల కొనరించిన తనదుండగముల నన్నిఁటిని క్షమింతు నని యు నచింపుము.''

అని పలికెను. ఈవాక్యము లాలించి రిపుకృతాంతుఁ డగు హనుమంతుఁ డల్లన వల్లభునిపదపద్మములకు మ్రొక్కి "రఘుకులతిలకా! మీయానతిచొప్పున నొనరింపఁగల" నని వినయమున మనవిచేసి, రాఘవునిచే దీవెనలఁ గొని యచట వీడ్కొని, తా నరుగుమార్గమున నున్న సుగ్రీవున కీవిధం బెల్ల నెఱిఁగించి, యనుపవచ్చిన విభీషణుని వీడ్కొలిపి సకలవానర దానవమానవనిచయంబులు జయజయధ్వనులు గావింప నరిగి ద్వారంబులం బలిసియున్న మహాదానవులఁ బరికించుచు నదృశ్యశరీరుఁడై నవప్రాకారములు గడచి, తనమహాకారముఁ గని కొందఱు పఱచెడివిధంబుఁ జూచి నవ్వుచు, నరయవచ్చినవారల హుంకరించుచుఁ జని చని, పట్టనంబు వీక్షించి యందలిశృంగారముల కచ్చెరువందుచు

"ఆ. వె. ఇట్టిపట్టనంబు నిందుగ్రినికై వశి
నేలుచుండ కీతఁ డేల క్రొవ్వె?
ఘనత గలుగుటకును వినయంబు భూషణ;
మదియు లేమి జన్మహానిగాదె."

అని యొగ్గించుచు మఱియునుం జనిచని నవరత్నఖచితాభ్రంకషసింహాసనమున నూఱుతలలు, నిన్నూఱుకరములు మిన్నుముట్టినపాదవునుం గలిగి గరుడ, గంధర్వ, సిద్ధ, విద్యాధర, కిన్నర, కింపురుష, దేవ, దాన, వోర, గాష్టదిశారమణశిరశ్శోభితం బగు తలాటంబుఁ గాల్కి ద్రొక్కి నిక్కుచుఁ దనచేఁ జె

అలువెట్టఁబడిన దేవభూదేవయోషాసముదయములు కన్నుల
నశ్రువు లొలుక నలుకుచుఁ దగినయూడిగములు సలుపఁ బ్రి
ఘానులతోఁ గొలువున్న శతముఖు నవలోకించెను.

3

ఇట్లుగాంచి మహాద్భుతము నొంది రావణునకు నిలినికి
ననేకాంతరాంతరం బని తలపోయుచుఁ ననార్యధైర్యగాంభీర్య
ధుర్యుఁడై డాసి, తదీయసింహాసనమునకుఁ బురోభాగమునఁ
దనవాలము దివిసోఁకఁ బెంచి వీఁకఁజుట్టి తదగ్రంబున నమ్మహా
దానవేంద్రునికంటెఁ బొడువుగాఁ గూరుచుండెను.

అంత శతకంఠుఁ డాతనిదారుణాకారము వీక్షించి యా
శ్చర్యంబును, భయంబును, నభిమానంబును, గోపంబును,
బురికొనంగఁ జింతించి యమ్మహావీరున కిట్లనియె.

"ఓరీ మర్కటాధమా! నీ వెవ్వండవు? ఎవ్వనిపంపునఁ జే
నిట వచ్చినాఁడవు? దానవవీరరక్షితము లగుప్రాకారము లెల్ల
గడచి వచ్చితివి? భయం బనునది యించుకయు లేక నాయె
దుట నెట్లు నిలువఁగలిగితివిరా?" యని గద్దించి యడుగ హ
నుమంతుఁ డిట్లనియె.

"ఓరోరిదనుజాధమా! నే నెవ్వండనో నీ వెఱుఁగవా?
రావణకుంభకర్ణాదుల రణరంగమునఁ బరిమార్చి లంకకు విభీ
షణునిఁ బట్టంబుఁ గట్టిన వివేకియు నప్రతిద్వంద్వశౌర్యుండును

నగు రఘురామునిబంటను, వాయుదేవునకు నంజనాదేవికిఁ దన
యుఁడను.

"మఱియు నెకిమీనివనికై లంక కేఁగుచు మహార్ణవ
ము నొకపిల్లకాల్వవోలె దాఁటి వనమెల్లఁ బెఱికి యక్షునిఁ దృ
ణప్రాయముగ నేలపైఁ గూల్చి, దివిజులు మెచ్చ దశకంఠుని
పురం బెల్ల దగ్ధంబొనరించి, పట్టవచ్చినవారల నెల్ల మట్టుపెట్టి
మరలి వచ్చుచు లంకిణినిఁ గూల్చి జలనిధి లంఘించి జానకీజా
డలు రామునకుఁ జెప్పిన హనుమంతుఁడను. నిన్నిప్పు డట్లే
చూడవచ్చినాఁడను.

" ఇదియునుఁగాక యోనీచహృదయా! రాఘవుఁడు
సీతాసహితుఁడై నిన్నుఁ జంప నరుదెంచియున్నవాఁడు. నే నా
తనిసేనల నెల్ల మోచికొనివచ్చి నావాలముపై నాలుగువార్ధులు
నవలీల దాఁటించితిని. నీయాయువు నేటితో మూఁడినది. నీ
కిఁక దిక్కెవ్వఁడురా?"

అని పలుకుటయు శతకంఠుఁడు మండిపడి "ఓరోరి కపి
కులాధమా! దూత నేమనఁగూడ దని యెంచి యూరకున్న
కొలఁది రాముఁడు గిముఁ డని నీ వామనుజాధముని బొగడఁజొ
చ్చినాఁడవు. వాఁ డొనరించుకార్యము నాపరిచారకుఁ డొక్కఁ
డరనిమేషమున నొనరింపఁగలఁడు.

అట్టిచో,

ఉ॥సీ. క్షుద్రమానవుఁ జెప్పి సుకృతాత్ముఁ డనుచును
బెక్కులు వలికెదు వెఱ్ఱికోఁతి
యొక్టి ధార్మికుఁడు రాయింతినిఁ దాటక
నణఁచి పిన్నపుడె స్త్రీహత్యఁ జేసె
నొకపాతవిలువంచి, వికలంబుఁ గావించి
యిల మహాదేవున కెగ్గుచేసె
నాతికై నిష్కారణంబుగా నవ్వాలిఁ
బడనేసె నత్యంతపాపమొదవ

గీ. నట్టికాంతాజనాంతకు నట్టి శైల
జాధిపద్రోహి నట్టిమహాఘచిత్తుఁ
జెప్ప నే మున్న దిఁక నీవు చేరినట్టి
వార్త వినిపింపఁగదరోరి వదరులేల ?"

అనవుఁడు హనుమంతుఁ డాగ్రహచిత్తుఁడై "ఓరీ ! దానవకులవినాశకా ! దేవదేవుండగు శ్రీరామచంద్రుని నిందించితి వేని నీయాయువు దుంగిపోఁగలదు. అంతమున రావణాసురుఁ డీవిధమునసె రాఘవుని దూషించి హతుఁ డయ్యెను. నీకుఁగూడ నట్లులె కాలముసమకూఱె. దేవతాద్రోహి వగు నిన్నుఁ గనుఁగొనినఁ దప్పక దోసము వాటిల్లఁగలదు.

పెక్కుమాట లేల ? రామభద్రునివాక్యములు సావధానుఁడవై యాలకింపుము. "ఓశతకంఠా ! నీ వీమూఁడుదినములు బంధుమిత్రుల నాదరించుచు నాశ్రితులకు నిల్లు చూఱ

లిచ్చుచుఁ, బుత్త్రమిత్త్రుల నలవరింపుచు నరుచిపరిహారముగా భుజించుచు సుఖయింపుము. వెనుక నెడ గలుగనేరదు గావున నీప్రాణము లఱచేత నునిచి సంగరమున కరుగుదెమ్ము."

అని పలికి హనుమంతుఁడు వెండియు నిట్లనియె. "ఓరీ! రాక్షసా! రాముఁడు కరుణాసముద్రుఁడు గావున నీ వాతని శరణువేఁడితి వేని నీ వొనరించిన గోబ్రాహ్మణాదిబాధల నెల్ల క్షమింతు నని పిమ్మట వచించెనటుఁ గావున నీ విప్పుడ యాతని శరణుసొచ్చి ప్రాణములఁ గాపాడుకొనుము.

"ఇచ్చట నిన్నుఁ బురికొల్పు తుచ్ఛరాక్షసుల నమ్మకుము. రాఘవుఁ డాదినారాయణుఁడు గాని నరుఁడు గాఁడు. పురుషులచే నీకుఁ జావు లే దని తలఁచితివేని యారామచంద్రుని వెంట జానకీదేవి చనుదెంచు టెల్ల భవన్నాశనమునకుఁ గారణ మని యెఱుంగుము. తదీయప్రభావముఁ దెలియఁ దలఁచితివేని మాతల్లి యగు చిత్రగంధి నడుగుము.

అనుటయు శతాననుఁడు ప్రళయకాలాగ్నిచందమున మండిపడి నూఱుమొగములు ముడివెట్టుచు, నాంజనేయునిఁ జంప నెంచి, దూతధర్మము విచారించి యట్టిపని మాని తన యాస్థానమునఁ గల మహాదానవు లందఱు మహాద్భుతమున వినుచుండ హనుమంతున కిట్లనియె.

"ఓరీ! నీచమర్కటా! నాప్రతాపమున కోడి దేవతలు

లంతటివారలే నాకు భృత్యులై యూడిగములఁ జేయుచుండ, నాహారార్థం బగు నొక్కనీచమానవుని నీ వెంతయో గొప్ప చేసి పొగడఁజొచ్చినాఁడవు. నీ కిఁకఁ బ్రాణములపై నాశయే లేదో ?"

"ఇదిగాక నీవు నాపరాక్రమ మెఱుఁగఁజాలకున్నాఁడవు. నే నలిఁగితినేని యగ్నిని బ్రజ్వరిల్లనీయక, వాయువును జలింపనీయక సూర్యచంద్రుల సంచరింపనీయక, లోకం బెల్లఁ దల్లడపడఁజేసెద. మఱియు రణరంగమున జయ మొసఁగూడు నట్లుగ మంత్రసిద్ధిజపములు గావించెద. ఇన్నియునుఁ గాక బ్రహ్మ యొసఁగినవరము లున్నవి. కావునఁ గాలుఁడైన నేఁ గడ కాలఁ దన్నఁజాలుదు. అట్టిపరాక్రమశాలి నగు న న్నాజానకీరాము లెదిరింపఁజాలుదురే ?

ఇన్నియుఁ జెప్పనేల ? ని న్నిప్పుడే పొడిపొడిఁ గావించి, రేపు నీభూపతి నేపుమాపి, తత్సతి యగు సీత నిటకుఁ గొనితెచ్చెద. నీ కిప్పు డెక్కడ నెవ్వఁడు దిక్కగునో చూచుకొమ్ము."

అని మహాకోపమునఁ గొందఱు నిశాచరులఁ బిలిచి "యీవనచరుఁడు కండకావరమున నొడలెఱుంగక గాఱులఱచుచున్నవాఁడు. వీనిం బట్టుకొని గబళింపుఁ" డని పలుకుటయుఁ దత్‌ణమె పెక్కురాక్షసు లరుదెంచి యాంజనేయునిఁ గదిసి యనేకవిధముల బెదరింపసాగిరి.

౪

అంత హనుమంతుఁ డాగ్రహచిత్తుఁడై "ఓరీశతకంఠా! నే నిం దొక్కఁడనె యూఱక చిక్కితినని నీ వెంచుచున్నాఁడవు. నన్నుం బట్టింప నీకె గాదు. నీయబ్బకైనఁ దరము గాదు. ఇదిగో నాపరాక్రమం బొక్కింత కనఁబఱచెదను."

అని హృదయమున రాముని ధ్యానించి, తనతండ్రియగు వాయుదేవునిఁ దలంచి వాలం బభివృద్ధి సేయఁ దొంచి, మోమున మంట లుప్పతిల్ల దుర్భరశరీరుఁడై మిన్నుముట్టఁ బెరిగెను.

అప్పు డాతనిమహాకృతిఁ గాంచి కొందఱు దానవులు వెఱచిరి. కొందఱు సందుసందులకుఁ బర్వులిడిరి. మఱికొందఱత్యంతభయమునఁ బరువు లిడఁజాలక "దానవేశ్వరా! కరుణింపవే" యని యఱచిరి. శతముఖుఁడును హనుమంతుని భీకరాకార మంతయుఁ దిలకించి భయకంపితుఁడై హృదయమున నెంతయు నడలఁజొచ్చెను. తక్కినహితు లెల్లరు నిర్విణ్ణులైరి.

అంత హనుమంతుఁ డత్యంతాగ్రహమున "ఓరీ! నిశాచరా! నన్నుఁ బట్టింప నెంచినందులకు ఫలం బిదిగో! అనుభవింపుమురా" అని యశనిపాతముఁబోలు తనముష్టిఘాతమున నాశతాననుని నేలపైఁ బడునట్లు బొడిచి, యాతనిసింహాసనముం దన్ని చూర్ణముగఁ జేసెను.

శతకంఠుఁడు తననూఱుతలలుఁ బగిలి నెత్తురు ఒబ్బిపా
ఱఁ బుడమిపైఁ మూర్ఛిల్లిన నాంజనేయుఁ డంతతోఁ బోక
యద్దనుజునిఁ గాలఁద్రొక్కి కిరీటము దుస్సి తివిచి యొప్పటిరూ
పుతో నచటు వీడ్కొని రఘునందనచరణారవిందధ్యానచిత్తుఁడై
తనకు నెదిరిన దైత్యులఁ బరిమార్చుచు, సింహనాదముసేయు
చుఁ గపిసేనాభిముఖుఁడై వచ్చి వచ్చి పురోభాగమున సకల
దళములతో నున్న సుగ్రీవునిఁ గాంచెను.

ఇట్లు కాంచి యతనికిఁ దద్వృత్తాంత మంతయుఁ జెప్పి
సంభావనలు గైకొని యచ్చోటు వీడ్కొని కపినాయకులెల్లరుఁ
ద న్నెదుర్కొని గాఢాలింగనములు గావింప, రయమున నరు
దెంచి, యనుజత్రయపుత్త్రపౌత్రపరివేష్టితుఁడై జానకితోఁ దన
రాక కెదురుజూచుచున్న రఘువరుం గాంచి వందనములు గా
వించి ప్రతాపలంకకుఁ దా నరుగుటయు శతకంఠుని తలలు వ
గులఁ బొడుచుటయు మొదలుగాఁ గల వృత్తాంత మంతయు
నెఱింగించి రేపు లగ్గకు దయచేయవలయు నని యెంతయుఁ
బ్రోత్సహించెను.

రాఘవుఁడు మిగుల హర్షించి యాతని నక్కునఁ జేర్చి
మిక్కిలి వినుతించెను. ప్రీతియు ననేకవిధములఁ గొనియాడెను.

ఇది యిట్లుండఁ బ్రతాపలంకయందు శతకంఠుఁడు మూ
ర్ఛఁ దేఱి తనసింహాసనము పొడియగుటకును, గిరీటంబు వోవు
టకును నడలుచుఁ, దనయిరుగెలంకుల భయవిహ్వలులై నిలిచి

యున్న బంధుమిత్రామాత్యాది నిశాటుల మొగములు వీక్షించి గంభీర భాషణముల నిట్లనియె.

,,సచివులారా! పిఱికిపందలై మీరింద ఱొక్కకోఁతి గానిని జూచినంతమాత్రమున కెంతయు భయపడి యేమియుఁ జేయఁజాలరైతిరి. ఇటులుండ నే నింకెటు లారాముని సంహరింపఁజాలుదు? మి మ్మెట్టు లిఁక నేలుకొందును?'' అని క్రోపంబును, శోకంబును గదురఁ జింతాసముద్రమున మునుంగుచున్న దనుజేంద్రునిఁ గనుఁగొని మంత్రు లిట్లు పలుకఁదొడఁగిరి.

,, దానవాగ్రణీ! మే మప్పు డేమఱియున్నతఱి నావానరుఁ డట్లేగెను. దేవరియాజ్ఞయైనచో మే మిప్పుడ పోయి యారామునిఁ జంపి యాతనిసతి నిటకు రయమునఁ గొనితేఁగలవారము. మాయట్టిమంత్రు లుండ నీ వింత వంత నొందనేల?

ఇదియునుంగాక, దేవతలే నీకు వెఱచుచుండ వారలు పంపఁగా నరుదెంచిన నరునికై నీ వింత యోజింపనేల? నీ వలిగిన నవ్వానచరులు, గిరిచరులు, మనుజుఁడు గినుజుఁడు నిన్ను మార్కొనఁజాలుదురే?''

అని బహుభంగుల మంత్రులు ప్రోత్సహింప నసురవల్లభుఁడు కోపమనస్కుఁడై యటనుండి వెడలి తనతల్లికి నీవృత్తాంతమంతయుఁ జెప్పనెంచి యంతఃపురమున కేఁగెను.



# పంచమకాండము



శతకంఠుఁ డట్లు తల్లిసన్నిధి కేఁగి సవినయముగ మ్రొక్కి దీనవదనముతో నిలుచుండినఁ జితగ్రంధి సుతునివైఖరి వీక్షించి యాశ్చర్యమానసయై యిట్లనియె.

"తనయా! ఎన్నఁడును లేనివిచార మిప్పుడు నీమొగమునఁ గానఁబడుచున్నది. యుష్మదహంకారము వీక్షించి మృత్యుంజయుఁ డలిగెనా? మునుల నేఁచితి వని వనజభవుఁడు శపించెనా? కృతాంతుఁ డతిసాహసమునఁ గింకరులతో దండెత్తివచ్చెనా? లేక, శరణాగతరక్షకుఁ డగురాముఁడు రణ మొనరింప నరుదెంచెనా? ప్రియసుతా! నీమోము విన్నఁదనముఁ గన్నయప్పటినుండియు నాహృదయము గలఁక నొందుచున్నయది. సందేహ ముడిగి నీస్వాంతమునఁ గలచింతకుఁ గారణ మెఱిఁగింపుము."

అనుటయు శతకంఠుఁ డాంజనేయుఁ డరుదెంచినమార్గంబును, వచ్చి రామునిఁగూర్చి వాదించినతెఱంగును, వాదించి గావించినవైఖరియు, వానినిఁ బట్ట దైత్యులఁ బంపువెట్టుటయును, బంపువెట్టినవారిఁ బదరుటయును, నాతఁడు దనరూపముఁ జూపుటయును, జూపి తన్నుఁ బొడుచుటయును, బొడిచి తన సింహాసనముఁ గూలఁదన్నుటయును, బిఱుసుతలాటము పోవుట

యును, మరలి వనచరుఁ డేఁగిన మహిమములును జెప్పెను.

చిత్రగంధి యావృత్తాంత మంతయు నాలకించి వికల హృదయమై మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలిసి "కుమారా! నే నెంత చెప్పినను నీవు నామాటఁ బాటింప వైతివి. అసురలోక నాయకుఁడవై *యష్టైశ్వర్యయుతుఁడవై యనవరత ♦మష్టభోగము లనుభవించు నీవిట్టి దుష్టచేష్ట లొనరించి కష్టములకుఁ బాల్పడుచున్నందులకు నేనెంతియుఁ జింత నొందుచున్నదానను.

ప్రియతనయా! తొల్లి నారదమహర్షి చే మీాజనకుఁడొక యద్భుతంపువార్త విని నా కెఱుంగింప నేఁ దెలిసికొంటి నది నీ కిప్పుడు చెప్పెద సావధానముగ నాకర్ణింపుము" అని యిట్లు చెప్పందొడఁగెను.

"జ్యోతిర్మయి యగు నొకమహాశక్తి చతుర్దశభువన నాయికయై ప్రవర్తించుచుండి తనస్వరూప మగు ఓంకారస్వరూపమున బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నుదయింపఁజేసి జన్మపోషణ లయకారులఁ గమ్మని నియోగించి వారికి సుఖములఁ గలుపు మని తనకళలచే ముప్వురుకన్నియలఁ బుట్టించి, యందు శారద యనుచెలి నజునకును, లక్ష్మి యనుతరుణి నచ్యుతునకును,

*అష్టైశ్వర్యములు:—1 దాసీజనము 2 భృత్యులు 3 పుత్రులు 4 మిత్రులు 5 బంధువులు 6 వాహనములు 7 ధనము 8 ధాన్యము.

♦అష్టభోగములు:—1 అన్నము 2 వస్త్రము 3 గంధము 4 పుష్పము 5 పానుపు 6 తాంబూలము 7 స్త్రీ 8 గానము.

గౌరి యను నారి శివునకును, దయచేసి ప్రపంచము నడుపుచు, నందు తనపూర్ణకళ యగు లక్ష్మిని బిలిచి యతిరహస్యముగ నిట్లనియె.

“సీభర్త యగు విష్ణుఁడు * త్రేతాయుగమున రాముఁడై రావణవధార్థ మవతరింపఁగలఁడు. తత్కాలమున నీవు జనకునకు నుదయించి జానకీనామమున రామునితోఁ బెండ్లియై యుండఁ గలవు. రావణుమరణానంతరమున శతముఖుఁ డనునొకరాక్షస వరుఁడు జనియించి, పురుషులచేఁ జావులేకుండ బ్రహ్మచే వరములు గొని తరుణులఁ దృణీకరించుచుండును.

కావున నేతన్నిమిత్తమున నీవు రామునివెంటఁ జని యాతని శక్య మగు సమయమున శస్త్రాస్త్రములు ధరించి యుద్ధం బొనరింపుము. అట్టియెడ నే నరుదెంచి నియం దావహించి నీ చేత శతముఖునిఁ జంపించెద” నని చెప్పి పంచెను.

పిమ్మట విష్ణుదేవుఁడు దుష్టనిగ్రహమునకై ధరాతలమున రాముఁడై జనియించె. అవ్విష్ణువక్షస్స్థలమునఁ జెలఁగు శ్రీదేవి సీత యయ్యె. శౌరి ధరించెడిశంఖచక్రములు భరతశత్రుఘ్నులైరి. ఆతనిపర్యంక మగు శేషుఁడు సౌమిత్రి యయ్యె. కావున రాముఁడు మానవుఁడు గాఁడు. అతనిఁ గొలిచెడి కపులెల్ల రమరులు గాని వనచరులు గారు. నీవు వారలతో వైర ముడిగి ప్రాణములఁ గాపాడుకొనుము.

---

*యుగములు:—1 కృతయుగము 2 త్రేతాయుగము 3 ద్వాపరయుగము 4 కలియుగము.

బ్రహ్మ యొసఁగినవరములఁ దలఁచి నీ వెంతమాత్రము గర్వింపఁబోకుము. అతఁడు తనతండ్రియగు విష్ణుదేవునిపూన్కిఁ దప్పింపఁజాలఁడు. కావున బెబ్బులిపైఁగోలఁ జాపి నట్లారాము నితో యుద్ధమునకు బూనుకొనక వెంటనే యాతని సన్నిధికేఁగి యతనిని శరణువేఁడి మనుము"

అని చెప్పి మఱియు నాచిత్రగంధి రామునివిక్రమమ్మును, అతనితమ్ములబలమును, తనయులవిధమును, సీతామహిమమ్మును, హనుమంతునితెఱఁగును, సుగ్రీవునిఘనతయుఁ, దత్సుతులగతియు బలములచలమును, విభీషణునిభేదములును, వారివారిశక్తియు ధర్మసంఘటనమును, గీర్తిసంపాదనంబును దెలిపియు బుజ్జగించియుఁ బలువిధముల మనసుఁ గలఁచియు నీతి గా దని చెప్పియు భయ మొదవఁజేసియు బహుగతుల బోధింప నారక్కసుఁ డవి యేవియు సరకుగొనక మహోగ్రచిత్తుఁడై యిట్లు పలికెను.

,, తల్లీ ! రాముఁడు విష్ణుం డనియుఁ, బరాక్రమంతుఁ డనియు, నీ వెంతయుఁ బొగడఁజొచ్చితివి. నీ వనినట్లు నిజముగ నాతఁడే విష్ణుఁ డైనచో రావణుఁడు తనరామను గొనిపోవఁ దనయుగ్రశరముల నాతనిఁ దెగటార్పనోపఁడే ? రామునిచాపనైపుణ్యము, బలపరాక్రమము నిందులఁ దెలియవచ్చెఁగాదే! అట్టినీచుని విష్ణుం డని పలికి నీవు నామనసు కరుగఁజేయ నెంచెదవు నేనట్టిమనుజాధమునకై భయమొందెద నని తలం

చిత్రివే ? నే నిప్పుడ యానరాధముని౯ జంపి యాతనిసతి నిటకుఁ దప్పక గొనితెచ్చెద.

అని వచించి దిగ్గునలేచిచని బంధుమిత్రామాత్యుల నక్కడక్కడఁ జతురంగబలములతోనుండ నియమించి రాముని౯ దలఁచి చంపతరాగ్నికై వడి మండిపడుచుండెను.

రాముఁడును భేరీకాహాళరావములు మీఱ, మౌర్వీనాదములు సెలఁగ సేనలం బురికొల్పి లగ్గలువట్టుం డని యాజ్ఞాపించుటయు బలము లెల్ల మహోద్రేకమునఁ గొమ్ములు గూలఁ ద్రోయుచు నగడ్తలు నేలముట్టఁ బూడ్చుచు లగ్గలువట్టి పర్వతములు, గుజములుఁ దెచ్చి కోటలఁ బొడిపొడిచేసి యందుఁగల దనుజవీరుల నెల్ల బాణపరంపరలచే నుగ్గుచేసి మఱియు ననేకప్రకారముల సకలకపివరులును లగ్గ లగ్గలంబుగాఁ బట్టుచుండ వారితోడనే విభీషణసైన్యంబులు వనచర, భల్లూక, శార్దూలరూపంబులఁ దలపడిరి.

మనుజబలంబులును నమోఘబాణంబులఁబఱపి పట్టనప్రాసాదతోరణకుడ్యాదుల నేలం గలుపుచుండిరి.

శతకంఠునిబలంబులును నింతింతని గణుతింప నలవిగాకుండఁ గదిసి పూర్వపశ్చిమసముద్రముల తెఱఁగునఁ గోలాహలముసేయుచుఁ, బిడికిళ్లఁ బొడుచుచు, గదల నడఁచుచుఁ, గతినపదములఁ దన్నుచుఁ, బలువిధములఁ బెనంగుచు గజముల కుంభస్థలములు పగులమోఁదుచు, హయములఁబడవ్రచ్చుచు

రథము లభగ్నములు గావించుచు, రథికులఁ గూల్చుచు, సారథులఁదుమ్రించుచు, భటుల నందఱఁ ద్రెంచుచు, నపారయుద్ధముఁ గావించిరి.

౨

అంత వనచర, భల్లూక, శార్దూల, మనుజబలము లెల్ల విఱిగి పాఱి క్రమ్మఱఁ బురికొని దైత్యులమీఁదఁ గదిసి, గదలుదుమ్రించియు, ముసలములు పొడిగావించియుఁ, జాపములు విఱిచియు, నఱచేతులఁ జఱచియు, గజములఁ ద్రొక్కియు, నింగికి ముట్ట నెక్కియు, నఖముల జీరియుఁ, గుంభికుంభములఁ బగులఁ బొడిచియు, నలుకలు మీఱియుఁ, బ్రతిపక్షులఁ డక్కిమియు, వాలముల మెఱిమియు, ముష్టిహతులఁ గ్రుమ్మియు, వాలరోమములఁ జిమ్మియు, గుఱ్ఱముల నదిమియుఁ, గుంజరములఁ దుమ్రించియు, రథముల నుగ్గుచేసియు రథికులఁ ద్రోచియు, సారథులఁ జంపియు, శరములఁ ద్రెంచియుఁ, బెక్కుచందముల నుక్కుమెఱసి పోరసాగిరి.

వారలఁ గని హర్షించి రామలక్ష్మణభరతశత్రుఘ్నులును దనుజులపై నలిగి యాగ్నేయసాయకము లందంద పఱపినఁ గూలు నేనుఁగులును, నేనుఁగులతోడనే వ్రాలు హయములును, హయములతోడనే పొడియగు రథములును, రథములతోడనే మడియు రథికులును, రథికులఁ గని పొరలు సారథు

లును, సారథుల దురవస్థలు గని తలఁకు భటులును, విఱుగు విండ్లును, నుఱుమగు శరములును, బరియలగు గదలును, దుని యలై పడిన ముసలములును, భిన్నములగు పట్టిసములును నుగ్గు అగు ప్రాసములును, దుత్తుమురులైన శూలములును, బడిన భిండివాలములును, దన్నుకొనెడి దైత్యులును, శోణితప్రవాహములును, ప్రవాహముల నీఁదులాడు భూతభేతాళశాకినీఢాకినీగణములును గలిగి యెదహోరాత్రములు చరణతలఘట్టనోద్ధూతధరాపరాగంబుచేఁ ద్రికాలములును సూర్యప్రభాచంద్రికాజాలంబు లేర్పఱుప రాకుండ నుండెను.

అంత దేవతలు పుష్పవర్షముఁ గురియించి యభ్రతలమున నిల్చి తద్రణవిశేషములత్యంతాశ్చర్యమునఁ జూచుచుండిరి. బ్రహ్మదేవుఁడును బ్రళయసమయముగాఁబోలు నని కాలము లెక్కించుచుండెను.

ఆసమయమున హతశేషులైన దానవు లతిభయాకులులై గతిచెడి నలుదెసలకుఁ బరువు లెత్తుచు, నదె వానరులు డాయవచ్చిరని శరీరములు గంపింపఁజేయుచు, నల్లదే భల్లూకతతి పొంచియుండె నని వెనుకకు మరలుచుఁ బాదపములుఁ, బర్వతములుఁ, దమమీఁదఁ బడవచ్చె నని తొలఁగుచు, నెందుఁ బోవుద మేది దిక్కని చేష్ట లుడిగి మూర్ఛిల్లుచుఁ, దెలిసి పుడమిపైఁ జదికిలఁబడుచు నప్పటికి లేచుచు, నుఱుకుచుఁ బోయి క్రొలువుకూటమునఁ గూర్చుండియున్న శతకంఠునియొద్దకుఁ జని

సాగిలిమ్రొక్కి పెద్దపెట్టున నేడ్చుచుఁ దమ్ము రాముని బారి నుండి రక్షింపు మని వేఁడుకొనసాగిరి.

అంత శతకంఠుఁడు వారల ననునయించి "దానవులారా! నే నుండ మీ రింతగాఁ జింతింపనేల ? వృత్తాంత మంతయు సవిస్తరముగఁ జెప్పుఁడు. నే నిప్పుడే సమరరంగమున కేఁగి మనశాత్రవుల నెల్ల సమయించి వచ్చెద" ననుటయు దైత్యులొక్కింత ధైర్యముఁ దెచ్చుకొని యఖిలమంత్రివర్గములు వినుచుండ నిట్లనిరి.

"దానవేశ్వరా ! మేము మీపనుపునఁ జని లగ్గలువట్టి తరుచరప్రకరములతోఁ బెక్కువిధముల నుక్కుమెఱసి పోరాడియు, నెఱిదప్పించియుఁ బరువెత్తించితిమి. కాని, యావనచరసేన వెండియుఁ బురికొని విపులవాలములఁ జుట్టియు, మొట్టియుఁ, గఱచియుఁ, జఱచియుఁ, గఠినశైలముల నడిచియుఁ,బొడిచియు, మాతోఁ బోరాడుచుండునంతఁ బ్రళయకాలరుద్రుఁడువోలె నారాముఁ డగ్నిబాణపరంపరలఁ గప్పిన, మనసైన్యములు గలంగి తలఁగి వాఱలేక ధరణీతలమున దగ్ధులై పడిరి."

"దేవా ! ఈవార్త లేమని విన్నవింతుము. స్తనితభాషుం డీల్గె; శార్దూలవదనుఁడు ద్రెళ్లె; రక్తాక్షుఁడు మడిసె; నగ్నిముఖుం డవనిపైఁ గూలెఁ; జిత్రుఁడు, గర్భశగాత్రుఁడు మొదలగు బంటు లెల్లరుఁ బీనుఁగుపెంట లైరి. మేము కొంద

ఐము చావునకుఁ దప్పి నీకిటులెఱిఁగింప వచ్చితిమి. అక్కటా! మనకులమునకు నేఁటితో నంతము గలిగినది. మన కిఁక నేది వెరవు ?"

అని వచించుటయు శతకంఠుఁ డగ్నివలె మండిపడుచు, లోకముల మ్రింగ నేతెంచు మృత్యువువలె హుంకరించుచుఁ బ్రధానులవంకఁజూచి "వింటిరే మంత్రులారా! రామునిఁజంపి సీతను గొనిరండని మనపీటనిశాచరులఁ బంప, వార లెల్లరు రామానరములచే వధియింపఁబడిరఁట ! ఇంతకన్న నప్రతిష్ఠ మన కింకొకటి గల్గునే ? నే నిప్పుడ చని యారాముని ననుజసహిత ముగ వధియించి కోఁతిమూఁక నెల్లఁ గడతేర్చి, సీతను బట్టి తెచ్చెదఁ గావున గంధగజాశ్వరథాదుల నెల్ల నాయితములు గావించి మీ రెల్లరు నావెంటఁ బయనమయి రండు."

అని యాజ్ఞాపించుటయు సచివు లెల్లరు లేచి నిల్చి "దనుజకంఠీరవా ! నీయానతి యైనచో మే మనలము నైన మ్రింగె దము. మృత్యువు నైనఁ బరిమార్చెదము. అట్టిచో మా కా రాముఁ డనఁగ నెంతటివాఁడు ?

నీ విప్పుడ భండనవేది యేర్పఱచి యుమ్మలో[illegible]గ్ని ని దరికొల్పి, శరయూపస్తంభమున విభీషణునిఁ బశువుగ బం ధించి, వానరసమిధల వ్రేల్చి, అసిపత్రిస్రుక్స్రువంబుల నేర్చి, [illegible] [illegible]ముగాఁ జేసి, తనయసహాయాదరతతులతో రాము [illegible] [illegible] వ్రేల్చి, యజ్ఞమనున సహాశ్వాభగన్న[illegible]

చేసి, సోమయాజి వై యుండుము. మేమును హోతలుగఁ జె లంగుదుము. మీయుద్ధ మనుయజ్ఞముఁ జేసినఁగాని త్రిజగ త్ప్రసిద్ధి రాఁజాలదు."

అనివచింప, దైత్యేంద్రుఁ డత్యంతసంతోషమున రా మునిఁ బరిమార్చెద నని మిన్నుముట్ట నెగురుచుఁ బెక్కువిధ ములఁ గసలుచుఁ దనశిరములు నూటిట మణికిరీటములఁదాల్చి మార్తాండశతముభాతిఁ దనమొగములు విలసిల్ల వామపాదమున గండపెండేరముఁ దొడిగి, యిన్నూఱుకరముల నస్త్రశస్త్రము లు పూని, రణమున నుత్సహించుచు, నూఱుకోట్లదనుజులు గొలువ మణిమయరథం బెక్కినఁ దన్మంత్రులు పదువురును యమ ములభంగి దండధరులై గజరాజములపై నెక్కి నలుదిక్కులు నిక్కలగునట్లు లార్చుచు నాశతాస్యునిఁ గొల్చుచు బయలు వెడలిరి.

## 3

అప్పుడు చిత్రగంధి తద్వృత్తాంత మంతయు నాలకించి "రాముఁడు విష్ణుం డనియు, సీత రమాసతి యనియు, వానరు లు దేవత లనియు, నీకు గెలుపు చేకూఱ దనియు, రణప్రయ త్నము మానుమనియు ననేకదూతలచే మరలమరలఁ బెక్కు వార్త లంపెను. కాని మదోద్రేకమున శతాననుఁ డామాటలు సరకుసేయక యుద్ధమునకు సంసిద్ధుఁ డయ్యెను.

అంత.

,,సీ. ఆవేళఁ గంకగృధ్రావళి పురివిచ్చి
 యాడఁగాఁ దొడఁగె శతాస్యుమీఁదఁ
గరము నెత్తురువాన గురిసె సేనలమీఁదఁ
 బిడుగులు వడఁజొచ్చెఁ బుడమి వణఁకె
వఱదు లంతంతకు వాపోయెఁ దలలెత్తి
 వెసఁ గొన్నిగొడుగులు విఱిగిపడియె
నెదురుగా నేతెంచె నేపుమైఁ బెనుగాలి
 మొఱఁగేది తురగముల్ మేఁత లుడిగెఁ
గీ. గదు విలాపించి యొఱలె నాకాశవాణి
చెలఁగి యడ్డంబుగా వచ్చెఁ జెన్నులపోతు
మఱియు ముందట నొకమహామలిన మైన
విధవరా లేడ్చెఁ బోయిన విభునిఁ దలఁచి."

ఇట్టియపశకునము లన్నియు శతాననుఁడు గాంచి కోపావేశపరవశుఁ డయి వెంటనే శాంతివిధు లొనరించి, ధీరుఁడై భేరీమృదంగాదిధ్వనులు పిక్కటిల్ల భైరవమూర్తియై వానరసంఘముల డాసెను.

అంతఁ గపు లాదానవేంద్రుని గంభీరాకారముఁ గాంచి మిక్కిలి భయమంది తమతమహస్తములలోని పర్వతపాదపశ్రేణిని గ్రిందఁ బడవైచి పరువు లిడసాగిరి. కొందఱు కపు లడలుచు గిరిగహ్వరముల కేఁగిరి. కొందఱు కూపముల డాఁచి విరూ

షములఁ గైకొని నేలపై వ్రాలిరి. మఱికొందఱు రామచంద్రుఁ డె తమ్ముఁ బరామర్శింపఁ గలఁ డని యాతని శరణువేఁడిరి.

ఈవిధమున వానరు లెల్లరు నెల్లదిశలకుఁ బఱవ భాను సుతుఁడు వారలఁ గనుఁగొని యొయ్యారముతో రాముని దన కేలఁ జూపుచు ‹‹ఓహో! వానరులారా ! ఏల మీ రట్లుభీతిల్లి పాఱెదరు? జగదేకవిక్రముండును, శరణాగతరక్షకుండును నగు రామచంద్రుఁ డీశతకంఠు నిప్పుడే తృణీలఁ బొలియింపనున్న వాఁడు. కావున మనకు దాపునుఁ, బ్రాపును, దల్లియుఁ, దండ్రియు నగు రాఘవునిదరి కరుగుదెండు.” అని హెచ్చరించెను.

అంతఁ గపిసైన్యములు తురల గిరితరువ్రజములఁ గర యుగ్మములఁ బూని యరుదెంచి ‹‹రఘుకులతిలకా ! సెలవైన యెడల మే మిప్పుడె యాశతాస్యునిఁ బరిమార్చి మీచరణసా న్నిధ్యమున కరుదెంచువార ” మని యేకగ్రీవముగాఁ బలికిరి.

అంత రాఘవుఁ డెంతయు సంతోషమొంది వారల మ న్నించి, నూఱుశిరములతోడను, నిన్నూఱుకరములతోడను మ హారాద్రికారమునఁ దనపై కరుదెంచు దానవవీరునిఁ గాంచి కోపభయము లుద్భవిల్ల విభీషణునితో నిట్లనియె.

‹‹అన్నా! యీవచ్చుమహాకారరాక్షసుం డీశ్వరుఁడో, కృతాంతుఁడో, యనలుఁడో, మృత్యువో, మఱియెవ్వఁడో గదా ! వీనిం గాంచినఁ జిత్తం బెంతయుఁ గలంగె. వీనితెఱం

12

కెఱిఁగించెదవేని నే నిప్పుడె పోయి యాతనినిగ్రహింపం జెల్లఁబో కా
ర్చెద''నుటయు విభీషణుఁ డిట్లనియె.

,, రాఘవేశ్వరా! ధైర్యశౌర్యోపేతుండును, బహుమా
యావర్తుండును, నగు శతాననుం డీతఁడె. వీనితోఁ బోరాడ
నెట్టివారికిని శక్యముగాదు. మఱియు యుద్ధసమయమున నీతని
శరీర మందలి రక్తం బించుక పుడమిపైఁ బడెనేని తత్క్షణమె
నూఱ్వురు శతాస్యు లుద్భవమంది యుద్ధమునకు సిద్ధపడుదురు.
ఈతనిచే మనబలంబెల్లఁ గ్రుంగు. ఈతఁడు పురుషుల కజేయుం
డు గావున మన కెల్లు జయము సిద్ధించునో యెఱుఁగరాదు"

అని మఱియుఁ జెక్కుచందముల విభీషణుఁడు శతకం
ఠునిప్రకారము లెఱింగించి ,, నృపవరా! యుద్ధముసేయునెడ న
ద్దానవేంద్రునిపై నాగ్నేయబాణము లేమఱక యేయుచుండుము.
దానంజేసి రక్తబిందువులు పుడమిపైఁ బడనేరవు. అందువలన
శతకంఠోద్భవము మిథ్య యగును."

అని యెఱింగించి, తత్ప్రధానులమహిమములఁ జెప్పి,
వారివారికిం దగినతూరులనేర్పరించి, యింక నాలస్యముతగ దని
పలికి హనుమంతుని వీక్షించి ,, మహాత్మా! ఇట్టిసమయమున
నెల్లెన గెలుపు సమకూర్చఁజేయుభారము నీపై నున్నయది.
ఇదియునుంగాక, నాపై నాశతకంఠుం డెప్పుడును విగ్రహించు
చుండును. కావున నన్ను నీ వేమఱక కాపాడవలయును."
అని చెప్పెను.

హనుమంతుఁడంచుల కొఁడఁబడి రాముని సాన్నిధ్యమునఁ దనవాలముఁ ద్రిప్పుచుండెను. భరతశత్రుఘ్నలక్ష్మణకుశలవ విజయసుగ్రీవాంగదులును మిన్ను వగుల నార్చుచుఁ బరివేష్టించియుండిరి. రాముఁడును ధనుర్గుణటంకారరవముల దిశలఁ బగిలించుచు, నమోఘశరము లేర్పరించుచు, సీత కభయముఁ దెలుపుచు, లక్ష్మణునిఁ బురికొల్పుచు ననేకవిధముల విజృంభించుచుండెను.

౪

అంత సుభటుబలములుఁ దలపడి శరవర్షములు గురియించుచు శైలములు ఱువ్వుచుఁ బాదపముల నడఁచుచు బహుగతులఁ బోరఁజొచ్చిరి. అప్పుడు దేవగంధర్వవిద్యాధర గరుడకిన్నర, కింపురుషాదు లభ్రతలమున నిల్చి యమ్మహాకలకలం బాకర్ణించుచుఁ జూచుచుఁ బరమాశ్చర్యము నొందుచుండిరి.

"ఇట్టివరము లేల యొసఁగితి వద్దురాత్మునిచే నఖిలకపి రాక్షసప్రళయము సమకూరుచున్న యది" యని దేవేంద్రాదు లెగ్గింప బ్రహ్మదేవుండును మనమున వగచి విన్ననై యుండె. ప్రళయకాలావసానమున నొదవు సకలభువనసంహారము ననుకరించి యుభయసేనాముఖంబులయందును, భీభత్సంబు దోఁచుచుండెను.

అంతట నీపాటిమాంసం బెన్నఁడును లభింపలే దని యు ప్పొంగు పిశాచములును, రుధిరంపు టేరులఁ దాండవములాడు ఢాకినులు, ఢాకినీగణముల డాసి మెదడులఁ ద్రావి యోకి లించుశాకినులును, శాకినీతతులడీకొని నెత్తుట నోలలాడు భేతాళతతులును, బురివిచ్చి యాడెడి కాకములును, గాకులగమకించు గృధ్రములును, గలిగి కావిరి దిక్కులెల్లఁ గప్పి దినము, సంధ్యయు, రేయియుఁ దెలియ శక్యముగా కుండెను.

అప్పుడు దీర్ఘజిహ్వా, శిఖిముఖ, స్థూలకంఠ, యోజన హస్త, శూర్పకర్ణ, రక్తాక్ష, పింగళాక్ష, గజోదర, త్రిముఖాది దానవవీరులు భరతశత్రుఘ్న, లక్ష్మణ, కుశలవ, విజయాది ప్రముఖులతో యుద్ధ మొనరించి కడతేఱిరి.

అంత శతకంఠుఁడు తనపదుపురు మంత్రులు గిదనరంగమున నీల్గుట కెంతయుఁ గ్రోధోద్రిక్తుఁడై మృత్యువువోలె లోఁజూచు మహానలశిఖిపరంపరలు భూమ్యాకాశములు నిండనేసి వానరబలములనెల్ల నంతిమొందింపఁగడంగెను.

మఱియును బిఱుతివియక నూఱుబాణముల నంగదుఁ గూల్చి, యిన్నూరుశరముల సుగ్రీవు నొంచి; యేనూఱుశిలీముఖముల భల్లూకపతిని మూర్ఛిల్లఁజేసి, యఖిలవానరులను క్షణమాత్రమునఁ జమరివైచి, కర్ణాటక దేశాధీశులఁ గదిసి కొందఱఁ బదతలమునహతము గావించి, వారలనెల్ల నొక్కపెట్టునఁ

డనవక్త్రగహ్వరములఁ జొనిపి, మఱియు హతశేషులగు మనుజ వనచరబలములనెల్లఁ బిలుకుమార్చెను.

ఇట్లు పోకార్చి పిమ్మట విభీషణుని గాంచి మండిపడి "వీనికతమున రావణకుంభకర్ణమేఘనాద ప్రముఖానేకదానవ కులంబునమసె. కులద్రోహి యగు వీనిం దెగటార్చవలయును."

అని బ్రహ్మాస్త్రము సంధించి, సకలలోకములుఁ దల్లడిల్ల నార్చిపేర్చిన నయ్యస్త్రరాజము విలయానలకీలాకరాళంబును, మృత్యుంజయఫాలనేత్రసంభూతమహోగ్రంబును, వీరభద్ర కోపంబును, గాలభైరవోగ్రంబును గూడ నైక్యము నొందిన విధమునఁ జిచ్చులు గురియుచు వచ్చి గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ విద్యాధరామరలోకములు హాహాకారములు సేయ విభీషణు నవయవములు బంధించి నేలం బడఁద్రోచెను. కాని యాతఁడు రాఘవకరుణాకటాక్షప్రభావామృతసంసిక్తశరీరుఁ డగుటం జేసి వానింజంప నోపదయ్యె.

అవ్విభీషణుని సైన్యములు నాడాడం బఱచి డాఁగిరి. వెండియు నమ్మహాదానవుఁడు కుశలవ, విజయ, భరత, శత్రుఘ్న, లక్ష్మణులతోడఁగూడ రాముని వధియింపఁబూని యొక్కపెట్టున ధనుశ్శతములు ధరించి, బాణసహస్రముల నొంటి నేయునివివశుఁ గావించి, శరవర్షముఁ గురియించుచు, నట్టహాసముఁ జేయుచు నరుదెంచెను.

అప్పుడు సీతామహాదేవి యతనిభీషణాగమనప్రకారము

వీక్షించి, తన యాదిమహామహిమ మాకర్షించి, శతకంఠునికిఁ దప్ప నెవ్వరికిం గానరాకుండఁ గనుపట్టెను.

శతముఖుండును రాముని జంపెద నని యార్చుచు డాసి, పురోభాగమున నున్న జానకిం గనుఁగొనునవసరమున, *నవబ్రహ్మలును, ♦నేకాదశరుద్రులును, † ద్వాదశాదిత్యులును, ద్రేతాగ్నులును, ముప్పదిమూఁడుకోట్లదేవతలును గానిపించిరి.

అంత శతకంఠుఁడు భయాకులుఁడై "యిది నాపాలిఁటిమృత్యువు గాని యాఁడుదిమాత్రము గా"దని నిశ్చయించుకొని, తా నరుదెంచుతఱిఁ దనతల్లి శణయాత్ర కనుగ్రహము సేయకుండుటకును, గ్రమమున దుర్నిమిత్తములు గనఁబడుటకును, భండనమునఁ దనప్రధానులు బలములతోఁగూడ బొలియింపఁబడుటకును జిత్తము వికలత్వ మొంద "నేఁటికి యుద్ధమొనరింపఁదగదు. రేపు చనుదెంచి రాముని సహోదరసహితముగఁ దెగటార్చెద" నని తలంచి తిరిగి ప్రతాపలంక కేఁగెను.

---

*నవబ్రహ్మలు:—చూ. 10 పుట.

♦ఏకాదశరుద్రులు:—1 ఉగ్రుఁడు 2 సోముఁడు 3 శరుఁడు 4 మృగవ్యాధుఁడు 5 రంతిజుఁడు 6 భిక్షుకుఁడు 7 అహిర్బుధ్న్యుఁడు 8 పినాకి 9 పాదుకేశ్వరుఁడు 10 కాపాలికేయుఁడు 11 భ్రాముఁడు.

†ద్వాదశాదిత్యులు:—1 అర్యముఁడు 2 మిత్రుఁడు 3 అరుణుఁడు 4 అర్కుఁడు 5 భగుఁడు 6 ఇంద్రుఁడు 7 వివస్వంతుఁడు 8 పూషుఁడు 9 పర్జన్యుఁడు 10 త్వష్ట 11 విష్ణువు 12 అజఘన్యుఁడు.

# షష్ఠకాండము

౧



రామచంద్రుఁడు విషణ్ణహృదయుఁడై విభీషణుబ్ర
హ్మాస్త్రబంధవిమోచనముగా బ్రహ్మమంత్రము లుచ్చరించు
చు, నందందు మూర్ఛిల్లినకపులఁ దనహస్తస్పర్శచే నలసరింపు
చుఁ, దమనిమిత్తముకై యరుదెంచిన దేశాధీశులఁ గని వగ
చుచు రేపు మగిడి దనుజుం డరుదెంచు నెల్లొకో యని చింతిం
చుచు సీతకు సంగరచాతుర్యములు దెలుపుచు హనుమంతుని
వినుతియొనరించుచు నుండె.

శతకంఠుఁ డిట్లు పరితాపలంకకరిగి కలహవృత్తాంతము
తియును, సీతామహిమంబును, దనపరాభవంబును, దల్లికి విని
పింప నమ్మానినియు మిగులఁ జింతించి ''తనయా! వలదువల
దని వాపోవుచుండఁగ నీవు నామాటలఁ బెడచెవినిఁ బెట్టి రా
మునితో రణమొనరింప నేఁగితివి. నీ వట్లు లేఁగుటయు నే
నప్పు డెంతయుఁ గలఁగినహృదయముతో నొక్కించుక కన్ను
మూసి యొకకలఁ గాంచితిని. అయ్యది నీకు వినిచెద నాలకిం
పుము" అని యిట్లు చెప్పందొడఁగెను.

,,రాముం డనియెడు నాదినారాయణునితో నీ వెదిరించి
నిలిచినట్లును, నది యెల్ల నాతఁడు గాంచి ,,పురుషులచే నీవు
చావకుండ బ్రహ్మ యొసఁగిన వరము లెల్ల నిలిపి యొక్కెన నా

శక్తిచే నిన్ను మడియింపఁజేసెద” నని హృదయమునఁ దలంచి యాయమ్మను బ్రార్థింపఁ దత్క్షణమె యప్పరంజ్యోతి రాముని చేతివిల్లునమ్ములు దివిసి కైకొని ఘోరయుద్ధముఁ జేసి నీ తల లవనిం గూల్చినట్లును, నాకోడండ్రు నిన్ను డాసి గోలు గోలున దుఃఖించుచున్నట్లును, గలఁగని మిక్కిలి చింతించి యంతలోఁ దెలివినొందితిని.

కుమారా! ఈ కల కల్ల గానేరదు. రేపటియుద్ధమున సీతచే నీకుఁ జావు తప్పదు. నే నింకొకపరి నుడువుచుంటిని. కోఁతిమూక లేనాఁటనైనఁ జతుస్సముద్రములు దాఁటె నను మాటవినియుంటివే? నీలంక యగ్గలంబుగ లగ్గపట్ట నరునకు శక్య మగునే? సురసంఘముల నెల్లఁ దెఱలువట్టిన పరాక్రమ శాలి వగు ని న్నెదిరింప నితరులు సమర్థులగుదురే?

కావునఁ దనయా! రాముఁడు విష్ణు వనియు, సీత మాయ యనియు, హనుమంతుఁ డీశ్వరుఁ డనియు నీబుద్ధియందుఁ దలఁచి యారఘురాముని మఱువుసొచ్చి యాతని శరణువేఁడి ప్రాణములఁ గాపాడుకొనుము.”

అని యనేకవిధముల భయపెట్టిన, శతకంఠుఁడు గనలి తోఁకఁద్రొక్కిన భుజంగము తెఱఁగువ, దండతాడితకంఠీరవంబు కరణిన, నాజ్యాహుత మగు ప్రళయాగ్నిచందంబున మండి మిట్టిపడి మొగములు ముడివెట్టుచుఁ గన్నుల నిప్పు లురులఁ

„దల్లివి యని యిమ్మాటలకు సహించితిని గాని యితరు లైనఁ దెగఁజూడనే? „స్త్రీబుద్ధిఃప్రళయంకరీ" యనుసామెత నిజమయ్యె. భీరురాల వగు నీబుద్ధి వినియెదు వెట్టియునుం గలఁడే"

అని యచట వీఁడ్కొని ప్రళయప్రచండసప్తార్చివిధమునఁ గ్రాలుచు మఱునాఁడు బటహాదిరవములు బ్రహ్మాండము ఘూర్ణిల్ల మ్రోయ దేరిపై కెక్కి, కొంత చిక్కినసైన్యములఁ గొని విలయకాలాంతకువడువునఁ గదలి రాఁదొడంగె.

రాఘవుఁ డచ్చట సుమిత్రాతనయుఁ బ్రేమతోఁ దిలకించి విభీషణార్కతనయపవనజజాంబవత్ప్రభృతు లెల్లరు వినుచుండ నిట్లనియె. „గతదినంబున శతాస్యుఁ డిచ్చటి కేతెంచి మనసేనల నెల్ల సంహరించి మనపైఁ జనుదేఱ వానియుగ్రాకారముఁ గన్నులారఁ గాంచి యొకకై వడి నుంటిమి గాని వానితోఁ బోరొనరింపఁజాల మైతిమి. ఎంతటివారికైన నొక్కొక వేళ బుద్ధి చంచలించుచుండునుగదా? అదానవుఁ డందుచేతనె యత్యంతరణోత్సాహమున మనపై కరుదెంచెను. ఈదినమున నెట్లైనఁ బోరి వానిని దప్పక సంహరింపవలయును"

అని వచింప లక్ష్మణుఁడు నవ్వుచు, „ అగ్రజా! నీ వీగతి వాక్రువ్వ నేల? ఈదినమున నాలావును, దైత్యులావును, బరామర్శించెదవుగాక. నావటుశరపరంపరలచే నద్దురాత్మునిఁ దెగటార్చుటొండె, నేఁ జచ్చుటొండె, జరుగవలయును. జం

తనునది నాకిసుమంతయైనఁ గలదే?" యని శౌర్యాలాపములఁ బలికెను.

భరతశత్రుఘ్నాదులును, పవమానసుతార్కతనయా దులును మహాశౌర్యమున "మే మిప్పుడె యాశతాస్యునిఁ బొలి యించివచ్చెద"మని యేకగ్రీవముగఁ బలికి యుద్ధసన్నద్ధులై శం ఖాద్యనేకరవంబులు సెలంగ రథములపై నెక్కిరి.

రాముఁడు విక్రమశీలుఁడై హనుమంతునిభుజముల యందు నిలిచి, జానకీదేవిని బశ్చిమభాగమున నిలిపి పవనజా మఱుఁగున విభీషణునిఁ బొంచియుండ నియమించి ధనుర్గుణటంకా రములు దిక్కులు పిక్కటిల్ల సలుపుకొనుచు, సురలు జయజ యధ్వను లొనరింపఁ గపులెల్ల రార్చ శతకంధరుని విలోకించు చు ధరణిజకుఁ జూపుచు నత్యంతసంతోషమున నుండె.

అంత శతాననుఁడు విలయాంతకుకై వడి హుంకరించుచు నేతెంచి పటుబాణపరంపరలచేఁ గొందఱఁ గపులఁ గూల్పఁ దక్కిన వానరులెల్లరు వృక్షమహీధరసంఘములఁ గొనితెచ్చి వానిపైఁ బడవైచి వానినిగడునొవ్వఁజేసిరి.

పిమ్మట నద్దానవుఁడు మూఁడుబాణముల హైందుని గీటణఁగించి, శతనవకముచే శరభునిఁ గూల్చి, నీలునిఁ బదింటఁ గ్రిందఁబడ నేసి, గోముఖు నేడింటఁ గూలఁద్రోచి, గవాక్షుఁ బదునొకంట నేలఁగూల్చి జ్యోతిర్ముఖు ముప్పదింట ఖండించి నలువది విశిఖముల ద్వివిదుని హత మొనర్చి, డెబ్బది

కాండముల గవయునిఁ బరిమార్చి, నూఱుశరముల నంగను నంతమొందించి జాంబవంతుని మున్నూఱుసాయకముల ధరపై నొఱఁగఁజేసి, గంధమాదనాదిమహాకపుల వేయిమార్గణముల మట్టుపెట్టి బ్రహ్మాండము వగుల నార్చుచు, నిన్నూఱుబాహువులయందు నస్త్రశస్త్రముల ధరియించి యమరు లడల రామునిపైఁ గదలి రా సుగ్రీవుఁ డడ్డపడియెను.

అంత శతాస్యుఁ డాతని నత్యంతాగ్రహమునఁ గాలం దన్ని, నేలం గూలనేసిన, లక్ష్మణుం డదిగాంచి మండిపడుచుఁ జటులోగ్రబాణము లానిశాటునిపైఁ బఱపి వానిని విరథుం జేయుటయు, నంత శతాననుఁడు విలయానలమువలె మండిపడుచు వేఱొకస్యందన మెక్కి నూఱువిశిఖములు సౌమిత్రిపైఁ బ్రయోగించి వెండియు నుద్దండుఁ డగుచు శక్తిం బ్రయోగించిన నది లక్ష్మణుని విల్లు విఱచి దేహము సొచ్చి చింప నాతం డరదముపై వ్రాలెను.

అప్పుడు సీతయును రాముఁడును శోకసముద్రమున మునుంగ భరతుం డది గాంచి యాశతాస్యుపై వివిధసాయకములఁ బఱపిన, దనుజుం డవి యెల్ల భగ్నముచేసి, ముష్టియుద్ధ గదాయుద్ధము లొనరించి తుద కొకశూలము వైచిన నది భరతుని యవయవములు ఛేదించి వసుంధరపైఁ గూల్చెను.

అంత రాముఁడు సీతాసహితుఁడై విక్కిలి చింతింపఁ దొడఁగెను; విభీషణాంజనేయులు బాష్పాకులితరక్తనేత్రులైరి.

దానవసేన లన్నియు మేటిమగలరీతి మిన్ను పగుల నార్చిరి. ఇంకఁ దన్నెవ్వఁ డెదురునో యని శతకంఠుఁడు రణోత్కంఠుఁడై యరయుచుండెను.

అంత శత్రుఘ్నుఁడు కాలాగ్నివలెఁ గన్నుల మంట లెగయ చిచ్చులవానలు గురిసికొనుచు సరభసమున దానవేశ్వరునిఁ గదిసెను. అట్లు గదియ శతకంఠుఁ డత్యంతకుపితుఁడై నూఱుకరములయందును నూఱుపెనుగదలఁబూని హుంకరించుచు విసరిన, శత్రుఘ్నుఁడు సకలగదాతాడితాంగుఁడై తూలి వణఁకుచు నెత్తుటఁ దోఁగి మెదలఁజాలక 'హారామ! హారామ!' యని రథముపై వ్రాలెను.

ఇట్లు ముగ్గురుతమ్ములుఁ బృథివిపైఁ గూలుటయు రాఘవుఁడు మహోగ్రుఁడై శతకంఠుని సంహరింపఁదలఁచి పటుబాణపరంపరలఁ బ్రయోగింపఁబోవుటయు నంతలోఁ గుశలవు లడ్డుపడి పశుపతియుగ్మమో, విలయభైరవద్వయమో, మృత్యుద్వితయమో, యనునట్లు వివిధాస్త్రపరంపరలఁ బ్రయోగించి శతకంఠునికరములన్నియు ఖండించి వైచిరి.

౨

అంతఁ దనుజేంద్రుఁ డెంతయు గుంది తనహృదయమున బ్రహ్మను దలఁచ నిండీయుఁ గరములు మొలచుటయు నాతఁడు ధనుర్గుణం బన మించి వెంటనే యగ్నిశరపరంపరల నేసి

బాలుర మూర్ఛ మునుంగఁజేసి మఱియు శబ్దభేదులగు మార్గణములఁ దదీయభుజయుగ్మములపైఁ బఱప నవి యుభయాంశల గుచ్చుకొని వారల విగతాసువులఁ జేసెను.

ఈవిధమునఁ దనయనుజులుఁ బుత్త్రులు దానవునిచే మడియుటయు రాఘవుఁడు బాష్పాకులితనేత్రుఁడై హృదయమునఁ గొంత చింతనొంది వెంటనే లయకాలాగ్నివలె మండిపడుచు సీతాసహితముగ నాంజనేయునిభుజములపై కెక్కి సురసంఘములు హర్షింప నసురవిభుని డాసెను.

శతకంఠుఁడును మహోద్దండప్రతాపంబున రాఘవునింగదిసెను. అంత రెండు పయోనిధులో, రెండు కులాద్రులో, రెండు చిచ్చులో, రెండు మదపుటేనుఁగులో, రెండు మృగేంద్రములో కదిసినట్లు వారిపోరు ఘనంబై యుండ నద్దాని నింద్రుండును, బ్రహ్మరుద్రాదులును గూడి యద్భుతానందమనస్కులై దివినుండి కనుఁగొనుచుండిరి.

ఇట్లు చాపవిద్యాగురుఁడగు రఘువరుండును, త్రిలోకకంటకుం డగుశతకంఠుండును, మహాయుద్ధసన్నద్ధులై రెండుగోరుల విజృంభించుటయు నానమయమున హనుమంతుఁడు మేరునగంబుసుం బోలు తనవాలము రామచంద్రుని ముందట నడ్డంబుగా నిలుప నది దనుజుం డేయుశరపరంపరలకు గుఱి యనఁ జెలంగె.

విభీషణుండును మానవదానవనాయకులు పెనంగునెడ రాఘవునిశరావళిచే నసురరక్తము చెదరి క్రిందఁబడకుండ నదుమనదుమ నాగ్నేయవాయువ్యాస్త్రము లేయనెంచి పావనిమఱువున నిల్చి యుద్ధసన్నద్ధుఁ డయ్యెను.

అంత శతాననుఁడు ప్రళయాగ్నిచాడ్పున నూఱువెలిగంబుల మంట లొదవ ననేకసాయకములు రాఘవునిపైఁ బ్రయోగింప నవి యెల్ల హనుమంతుని విశాలవాలమునకు సోఁకి తునియలగుచుండెను.

పిమ్మట రాముఁడు కోదండము వంచి పటునారాచపరంపరలు ప్రయోగింప నవి యన్నియు శతకంఠునిశరీరముపై నాఁటి మహాద్భుతముగఁ జూర్ణము లయ్యెను. అంత రామచంద్రుఁడు మరల నొక్కదివ్యాస్త్ర మత్యుగ్రశరాసనమునఁ బూని యేయుటయు, నది భటున కైదు, హయమున కిరువది, కరికి శతము, సారథి కిన్నూఱు, చక్రములకు వేయి, కేతనమునకు లక్ష, రథికున కఱువదిలక్షలు నై, భూమియంతయు నిండ, దనుజేంద్రుఁ డవి యన్నియు నత్యంతశీఘ్రమున నడుమనే త్రుంచి మఱియు రామునిపై ననేకబాణపరంపర లేసెను. అంత నవి యెల్ల మరల హనుమంతునివాలమునకుఁ దాఁకి ముక్కలు ముక్క లయ్యెను.

వెండియు దానవేంద్రుఁడు దననూఱుకరములయందును విండ్లు పూని రామునిపయి నాగ్నేయసాయకశతంబు లేయుట

యు నందలికొన్ని కాండము లాంజనేయునివాలమునకుఁ దాఁకి మరల హతము లయ్యెను. కొన్ని రాముని వ్రేళ్ళ్కలువ్రియ్యఁగఁ దూఱిపాఱెను. మఱికొన్ని విభీషణునకుం దగిలెను.

"అంత రాఘవుఁడు మహోగ్రాకారుఁడై నే నుండవలె, లేక దానవుఁ డుండవలె నీక యిరువురు నుండుట పొసఁగ"దని గంభీరముగఁ బలుకుచు ననేకవాఁడిశిలీముఖములు వింటసమర్చి యేసినఁ దత్కాంతము లత్యంతప్రచండాకృతి నాశతాస్యునిశరీరమున గాఢముగ గ్రుచ్చుకొని యవ్వలఁ దూఱి యాచేరువఁ గలపర్వతము పగులఁ దాఁకెను.

అంత విభీషణుఁడు రోషాయత్తచిత్తుఁడై వింట ననలాశుగములఁ దొడిగి శతకంఠునిరుధిరబిందువులు పృథివిపైఁ బడకుండఁ బఱపిన దానవుం డందుల కెంతయుఁ గినిసి, మహాదర్పంబున నార్చుచు, మానంబు చెడఁదిట్టుచు, "ఓరీవరాధీనా! ఓరీవిభీషణా! ని న్నిప్పుడే యమాలయమున కంపించెద. నీ కీఁక దిక్కెవ్వఁడురా?" అని పెల్లార్చి సమంత్రకముగ బ్రహ్మాస్త్రము సంధించి "కులాపరాధి యగు నిక్కుటిలదానవు నిలపైఁ గూల్చి ర"మ్మని వైచిన నది యంతంతకుఁ జిచ్చు లీనుకొనుచు నతిశీఘ్రమునఁ బోయి విభీషణుని బంధించెను.

రాఘవుఁ డది గాంచి యనలాస్త్రములు పఱపిన శతకంఠుఁ డవి యెల్లఁ ద్రుంచి తిరిగి యాతనిపై నైంద్రాస్త్రములు వైచెను. రాముం డవి తోడనే ఖండించి యహిశరపరంపర

లేయ, దనుజుం డవ్వానిం జక్కాడి వాయువ్యాస్త్రశతంబులం బ్రయోగించెను. రాముం డవి యవలీలం దునుమాడి ఘోర నారాచపరంపరలు గురియించి దనుజుని రథము భగ్నముం గావించి, చాపము ఖండింప శతాస్యుండు రుద్రునికైవడి మండిపడుచు బ్రహ్మాండము పగుల నార్చుచు రాముని జంప నొక మహాశూలముం బ్రయోగించెను.

అంత నాశూలము విలయకాలాగ్నివలె మండుచు నరుదేర హనుమంతుం డాశూలము నుగ్రవృత్తిం బట్టి నడిమికి విఱువం దొడంగెను. శతకంఠుం డాసమయమున రాముని జంప నిదియె యదన నని యెంచి హుమ్మని హుంకరించుచు నొక్కపెను గదచే రామునివీపుపై మోదెను.

రాముం డాతాంకున కెంతయుం దల్లడిల్లి హృదయమున నెంతయుం గనలుచు నర్ధచంద్రాస్త్రశతంబు వింట సంధించి "దేవతాసముదయంబులభక్తి నాపైం గలిగియుండె నేని వీని శిరములు, గరములు నేలంగూలుంగాక" యని వైచినం దత్క్షణమె శతాననునితలలుం జేతులుం దెగి నేలపైంబడెనుగాని యవి క్రమ్మఱం దొంటిపోలిక వెంటనే మొలచెను!

మఱియు శతకంఠునిరక్తబిందువు లవనిపైం బడి నూఱ్వురు శతముఖు లుద్భవిల్లి యెక్కడం జూచిన నక్కడ నట్టివికృత దైత్యులు వెల్లివిరిసియుండ నందులకు రఘురాముం డందందుం గోరవలసివచ్చుట కెంతయు నడలుచుండ నంతలో నాంజనేయుం

డాశ్యాలముం దుంచి సీత కెక్కడ శితశరములు దగులునో యని తనవాలము మేరునగమురీతిఁ జుట్టురాఁదిగిచి నిలిచియుం డెను.

అంత రాఘవుఁడు చింతాకులితస్వాంతుఁడై "అకటా! ఈదుష్టాత్ముఁ డెచ్చటఁ గనినఁ దానే యగపడుచున్నవాఁడు. నే నేవిధమున వీనిఁ బరిమార్తు? ఏవిధమున మునిదేవతాదుల రక్షింతు?" నని యనేకప్రకారములవంత నొందసాగెను.

అప్పుడు సీతామహాదేవి మగనివగపుఁ గనుఁగొని తన యద్భుతరూపమహిమాసామర్థ్యముఁ దలపోసి తనచే నంతయు సాధ్యంబగుట సిద్ధంబుగాఁ దెలిసి శరములు మొగిడ్చి కాంతున కిట్లనియె

"రఘుకులసుధార్ణవపూర్ణిమాచంద్ర! మదీయప్రాణ నాథ! మీరు శ్రమఁదీర్చుకొనుఁడనుక భవదీయమహిమాతిశయమున నే నొక్కింతదడవు మీచేతివిల్లునమ్ములుఁ బూని రిపు నితోఁ బోరొనరించెద. ఆఁడుదాన నని యనాదరంబుసేయక నావిన్నప మాలింపవేఁడెద."

అని పెక్కుచందములఁ బ్రార్థింప రామభద్రుఁడు తన మనమున నచ్చెరు వొంది, తొలుతఁ దశతో వసిష్ఠుఁ డెఱిఁగింపఁ దెలియంగనము, జానకి తన్ను సెలవు దయచేయుమని వేఁడుట యున్ను, శతాననుఁడు విరించిని గోరునెడ స్త్రీలఁ దలఁపకుండుటయు ననేకవిధములఁ దలపోసి, దనుజుఁడు మడియుట సిద్ధం

అని మనమునఁ దోఁచిన నలరి శార్ఙ్గాసనబాణతూణీరము లాశీర్వాదపూర్వకముగ భూపుత్త్రి కొసఁగెను.

అంత సత్తరుణీమణియుఁ బరంజ్యోతి స్వరూపముఁ గైకొని వాయునందనునిభుజముపై మిన్నుముట్ట నిలిచి తనమహాతేజము భూనభోంతరాళములఁ బరిపూర్ణముగా నింత మహోద్దండకోదండం బెక్కుపెట్టి సకలబ్రహ్మాండభాండములు ఘూర్ణిల్ల గుణటంకారములు గావించి, తనమహామాయ నాకర్షింపనది పాడసూపుటయు "నీవు దనుజానికబిందువరంపరలు ధరం దొరంగకయుండ నాలుక యెటుచూచిన యోజనంబు మేగఁ బఱపి యెవ్వరికిఁ గనఁబడకుండ నదృశ్యరూపమున నుండు"మని నియోగించెను.

పిమ్మట రాఘవుఁ డాశ్చర్యమానసుఁడై చూచుచుండఁ బుడమివట్టి యమోఘబాణపరంపరల నిగుడించి శతముఖుల నందఱను వాయువ్యాస్త్రముల నొక్కదిక్కునకుఁ ద్రోయుచు, మహాఖాద్దండ ప్రచండభండనముఁ గావించిన నాశతాననిచయంబును దదీయతేజోవిశేషంబునఁ జేతులాడక నిర్ఘాంతపడి దిక్కులు చూడసాగెను.

3

ఆసమయమున సీతాసతి క్రోధఘూర్ణితమానసయై నిశితమార్గణశతంబుఁ గైకొని వింటనంధించి కేవల లక్షిసుతింపఁ దనభర్త వినుచుండ నిట్లనియె.

“గీ. మూఁడుమూర్తులకును నేనె మూలదుంప
నగుదునేని శ్రుతుల్ సత్య మగునయేని
పుడమి నిజశతకంఠుఁ డొక్కఁడును దక్క
నున్న శతముఖహీనమై యుండుఁగాక.”

అని పలికి యాకర్ణాంతము విల్లులాగి యేయుటయు సత్యశతకంఠుఁడుదక్కఁ దక్కినవా రెల్లరు మాయమై చనిరి. అందులకు శతాననుఁ డెంతయు నద్భుతమంది “యిది సీతమాయకాఁబోలు, లేకున్న నిట్టిచందం బుండునే!” యని మనమున నెంచుకొనుచుఁ గ్రిమ్మఱ సీతపై బాణము లేయఁజూచుచుండ నామెయందు దొమ్మండ్రుబ్రహ్మలును, పదునొకొండ్రురుద్రులును, పన్నిద్దఱుసూర్యులును, త్రేతాగ్నులును, ముప్పదిమూఁడుకోట్లదేవతలును మరలఁ గనఁబడఁజొచ్చిరి.

అంత శతాననుఁడు మిక్కిలి భయాకులితహృదయముతో నిర్విణ్ణుఁడై చూచుచుండ నెచ్చటఁజూడ నచ్చటనె జానకి మృత్యువుపోలెఁ గానఁబడుచు రామునిపేరిటిబాణపరంపరల నేసి శతకంఠునివిండ్లుఁ గిరీటములు త్రుంచి వానిని రథముపై మూర్ఛమునుంగఁ జేయుటయుఁ దత్క్షణమె సూతుండారథము రణరంగమునుండి యావలికిఁ గొనిపోయెను.

అంత.

సీ. “పుష్పంబు లఱచేతఁ బూన నేరనిచెలి
యిషుపరంపరఁ బూన నెట్లునేర్చెఁ!

జిల్కపల్కులకు బిట్టులుక్కిపోయిన యెల
మెల్ల భీతిల నార్వ నెట్లుసేర్చె?
నేఁదక్క నన్యుల నీక్షింపనేరని
యింతి సేనలఁ గూల్ప నెట్లునేర్చె?
విసవిస నడువంగ నసియాడుకొమ్మ నేఁ
డడసి యుద్ధముసేయ నెట్లుసేర్చె?

గీ. అనుచు రాఘవుఁ డద్భుతహర్షవార్ధి
నోలలాడుచు హనుమంతువాల[illegible]ము
వినుతిసేయుచు నాతని వీపుమీఁద
నుండె, జానకిపైఁ బ్రేమ నిండుకొనఁగ.

పిమ్మట దానవేశ్వరుఁడు మూర్ఛఁదేఱి సారథిని వింతగఁ జూచి ,, ఓరీ! పరవీరులు నవ్వ నీ విటు లరదంబు రణరంగమునుండి కొనితెచ్చుట యుచితమే?" యని యడుగుటయు సూతుం డిట్లనియె:

దానవాగ్రణీ

చ. తెలిచినయట్టివేళ, మతి చింతగఁ గైదువు చిక్కుబాఱఁగా
మఱచినయట్టివేళఁ, బలుమాఱు విరాతికి వెన్నుఁజూపుచుం
బఱచినయట్టివేళ, నగుబాటుఘటిల్లఁగఁ జేతిపూఁతలం దాఁ
గఱచినవేళలందు, నెడ గల్గ రథంబు మరల్చు టొప్పుగన్"

అనునీతి ననుసరించి నే నటు లొనరించితి నిందు నాతప్పేమియు లేదని పలుకుటయు దానవుఁ డందుల కత్యంతసం

తోషముఁ బొందినట్లుగా నిపించి దగుంబడు నయ్యును మొసఁగి ,, నేఁటికి నా ప్రాణములు సీతపైని బలిసేయువట్లు తోఁచుచున్నది గావున నింటికేఁగుటయే కర్తవ్యమని యెంచి వెంటనే గృహాభిముఖుండై చనియెను.

అట్లు చనిన జానకిదివ్య తేజోమహిమంబును, శరముల వేగంబును, బాణసంధానచాతుర్యంబునుఁ నుపసంహారచమత్కృతియు నుగ్గడించుచు నెక్కడఁ గాంచిన నక్కడఁ బరంజ్యోతిస్వరూప మగు సీత కనఁబడినట్లయి మిక్కిలి భీతినొందుచుఁ జిత్రకేతుని మరణము సిద్ధంబని నిశ్చయించుచు, నిజపురింబో రలుచుండెను.

అంతట నాతనితల్లి చిత్రగంధి యతని చెంత కరుదెంచి తనకరమునఁ దద్గాత్రము నిమిరి, యందు రక్తప్లుతనిమ్నోన్నతముగ నపరిమితశరములు నాఁటి విఱిఁగియున్నఁ గనుంగొని మిగుల విలపించి యిట్లనియె.

అకటా ! తనయా ! *అరిషడ్వర్గముల జయించి •సప్తవ్యసనములకు లోనుగాక కీర్తిప్రసిద్ధుఁడవై మెలంగి శాశ్వతసుఖ

*అరిషడ్వర్గములు:—1 కామము 2 క్రోధము 3 లోభము 4 మోహము 5 మదము 6 మాత్సర్యము

•సప్తవ్యసనములు:—1 జూదమాడుట 2 స్త్రీలఁగోరుట 3 కల్లుఁద్రాగుట 4 వేటలాడుట 5 కఠినపుమాటలాడుట 6 ఒరులసొమ్ము నపహరించుట 7 ఒరులనిందించుట :

మనుష్యవింపుమని నెయ్యంబున నేఁ బలుకువాక్యములు వీనులఁ జొరనియ్యక యింత చేసికొంటివి. సీత యన నెవ్వతె యను కొంటివి? ఆయమ్మ యెక్కడ నలుగునో యక్కడ నిర్మూలత బగు, నెక్కడఁ గరుణించు నక్కడఁ గళ్యాణపరంపరాభివృద్ధి యగు, నప్పరంజ్యోతి మాయకు బ్రహ్మరుద్రాదులు లోను కాని వెలిమై బ్రవర్తింపనేరరు.

మఱియు నమ్మహాశక్తియందు భూనభశ్శైలసముద్రాద్యపారస్థావరంబులును, మృగాండజోరగపిపీలికాద్యసంఖ్యాజంగమంబులును, గలుగుబ్రహ్మాండములు నూఱుకోట్లు పుట్టుచు గిట్టుచు నటించుచుండును.

ఇదియునుంగాక నాదిమధ్యవిలయంబు లమ్మహామహిమంబునకుఁ గానఁబడవు. నీకు మొదట విరించి పురుషులచేఁ జావులేకుండ వరము లొసఁగునపుడు దేవతలు గినిసి ,,యిట్టివరము లొసఁగిన నద్దానవుఁడు లోకముల బాధపెట్టఁగలఁడు. ఇంత వత్సలత నీకుఁ దగ" దని దూఱినబ్రహ్మయు లజ్జించి శత ముఖుఁడు పురుషులఁ దడవెఁ గాని తరుణులఁ దలంపఁడటుగాన మిమ్మును, గోబ్రాహ్మణులను నాతఁ డెవ్వఁడు చెవంకు నప్పుడే జానకీదేవి తనతోంటిదివ్యరూపమున నాతని వధించు నిందులకు సందియ మెంతమాత్రము లే" దని పలికెను.

అటుగావున సీతయుఁ జిదాత్రిపం బగుమాయగాని సామాన్యకాంత గాదు. ఎట్టిచందమున నైన నమ్మగువచే భవ

న్నాశంబు సత్యము. ఇట మమ్మును బుత్త్రమిత్త్రకళత్త్రముల ను మనుపఁజూచెద వేని సీతారాములకు శరణుసొచ్చి “మీరు మాకుఁ దల్లిదండ్రులు. మీరు తప్ప మా కితరు లెవ్వరును లేరు. రక్షింపుఁ” డని పలికి ప్రాణములఁ దక్కించుకొని సకల భోగములఁ దేలుచు బ్రదుకుమని పెక్కుచందములఁ బలికిన నప్పలుకులు ములుకులవలెఁ గర్ణరంధ్రముల సోఁకిన నులికిపడి దశాననుఁడు తల్లి కిట్లనియె.

“తల్లీ! నన్నిట్లేల బెదరింపఁజూచెదవు? నాపరాక్రమం బీ వెఱుఁగవే? నే నొక్కింత యలిగిచూచిన నినుండెండలు గా య వెఱచును. కృశానుఁడు ప్రజ్వరిల్ల భీతిల్లును. మృత్యువున కే నేనుమృత్యువునై మెలంగెదను. అట్టి నన్నా నరాధముండగు రాముండును, నాతనిసతియు గెలువఁజాలుదురే? నీ విఁక నిట్టి మాటలఁ గట్టిపెట్టుము. నేను రేపె చని నాశత్రువులనెల్ల సం గరరంగమున సంహరించి వచ్చెద. నీ విఁక నాతో మాఱుమా టాడకు” మని పలికి యామె నింటి కనిచి, తా నంతిపురమున కేఁగి శయనించెను.

అక్కడ రాఘవుండును దనతనయసహోదరాదులమరణ ముల కత్యంతవిషాదసాగరమున మునిఁగి వారలఁ దలఁచితలఁ చి విలపించుచుండ, వైదేహి భర్త్రం గని “ప్రాణకాంతా! ధై ర్యముఁ దొఱఁగి మీ రిట్లేల దుఃఖించెదరు? క్షత్రియోచితం

బగు రణ మొనరించి వీరస్వర్గముఁ జూఱఁగొనినవీరుల్కై , నీవా రింతగాఁ జింతింపఁదగునే?

ఇదియునుఁగాక నెక్కడితనయు. లెక్కడిసోదరులు? సంసారమె మిథ్య యనునుడు లాలింపవే?" అని యనేకవిధముల బోధింప రాఘవుఁడు కొంతవడికి దుఃఖం బుడిగి జానకీసోదరు లాత్మజులతో విభీషణుని దరిసి యాతనియవస్థ కొంతయు బరిశీలించి తోడనే యాతనిబ్రహ్మాస్త్రబంధవిముక్తుం జేసి సౌమిత్రి జాంబవంతునిఁ గాంచి యాతనిశరీరమున గ్రుచ్చుకొనియున్న బాణముల నన్నిటి నూడఁదీసి యాతనిపైఁ జేయివైచి నిమ్మిరి యనునయాలాపముల నాతని సంతోషచిత్తునిఁ గావించి మఱియుఁ బరికించుచు ముందున కరుగుచుండెను.

అంతఁ గొండలవలె నేలఁ గూలిన మదగజములు మేఘములుగను, మోకాలిబంటిఁ గనువట్టుమెదడు పంకముగను, నలుగులతాఁకున నిలిచియున్న మాంసఖండము లింద్రగోపములుగను, నెడనెడఁ బేరుసిరక్తము లంబుప్రవాహములుగను, వాహినులగుంపు శరవర్షముగను, సేనలహుంకృతు లుఱుములుగను, దోఁచి వర్షకాలమువలె నప్పుడు వారలకన్నులకు మహాద్భుతముగ గోచరమయ్యెను.

పిమ్మటఁ గొంతవడికిఁ దెల్లవాఱుటయు శతకంఠుఁడు విలయాంతకుగతి నత్యంతాగ్రహమున బాణతూణీరముల్గైకొని తేరిపై నెక్కెను.

సీతయు విల్లుఁ ౙమ్ములు ధరించి ధవుని యానతి మ్మఱున్నం దనువిభుజములపై నిలుచుటయు. రాముఁడు తనరాము చెంతనె నిలిచియుండెను.

విభీషణుండును వారల చెంతఁ జేరియుండెను. సుపర్వు లెల్లరు దివినుండి వీరల బాణసంధానమై పుణ్యము నత్యంతాశ్చర్యముగఁ దిలకించుచుండిరి. అంత సీతాదేవి దేవత లెల్లరు మెచ్చునట్లుగ దివ్యబాణశతంబులు శతకంఠునిపైఁ బ్రయోగించెను.

దానవేంద్రుఁ డవి యెల్ల వారించి హనుమంతు నాగ్రహాదృష్టిఁ గాంచి యాతని నంతమొందించినచో రాముఁడును సీతయు నవలీలఁ జత్తురని యెంచి మారుతిపైఁ బటుబాణశతంబు లేసిన జానకి వాని నెల్ల నల్లన త్రెళ్ల నేసెను.

అందుకు శతకంఠుఁ డెంతయు నద్భుతకోపముల నంది సీతపై శాతశిలీముఖములు పుంఖానుపుంఖములుగ గుప్ప దైత్యదేహి తచ్ఛరసముదాయముల నన్నిటిని ద్రుంచి వానికిరీటంబును, చాపంబును, వాడి శిలీముఖములచే నేలపైఁ బడఁగొట్టెను.

దానవుఁ డందుల కత్యంతాగ్రహచిత్తుఁడై మహాగదావళిని బిరబిర ఱువ్విన, జానకి వాని నెల్లఁ జూర్ణముఁ జేసి మహాకోపంబున "శతాననునిశిరములు నేలం గూలుఁగాక" యని విష్ణుశరం బేయుటయు నదియగ్నిజ్వాలల నీనుచుఁ బోయి శతాస్యునితలలు, బాహువులు దునియలుచేసి యేతెంచెను.

అంత వెంటనే తచ్ఛిరములుఁ గరములు మరల మొలక

లెత్తుటయు సీత తిలకించి వెండియు వానిని ఖండించెను. మరల నవియు నెప్పటివలెనే మొలక లెత్తెను.

ఇట్లు ఖండితములైన దానవేశ్వరునితలలుఁ జేతులు తండతండములై కొండలవలెఁ బోగులయి యుండుట ధరణిజ గాంచి యత్యంతాశ్చర్య మొంది బాణము లేయుట మాని "అక్కటా! నే నీదానవుని శిరములుఁ గరములుఁ దుంచి వేసరితిఁ గాని యీతం డీల్గుట గానరాదయ్యె. వరముల సత్త్వమో మఱియేమి కారణమో కాని యీతని గెలువశక్యము గాకున్నయది."

అని మనమునఁ జింత నొందుచుండ నంతలో నారదమహర్షి యాకస్మికముగ నచ్చటి కేతెంచి సీతాసతికి నమస్కరించి నిల్చిన రాఘవుఁ డమందానందమున నాతనికి దండప్రణామంబు లాచరించి ,,మునిచంద్రా! భవదీయాగమనము మదీయవిజయకారణం బని తలంచెదను. అవక్రపరాక్రమంబునఁ బోరాడు నీదానవవీరునిఁ బరిమార్చువిధం బెఱుంగక చింతాసముద్రమున మునింగియున్నవారము. ఇందులకుఁ దగువెర వెఱింగించి కాపాడవే" యని వేఁడుకొనియెను.

౮

అంత నారదముని యాదాశరథిం గని యిట్లనియె. ,,రామచంద్రా! మీ రీవిధమున నెంతపోరిన నీశతకంఠుఁ డీల్గు

వాఁడు గాఁడు. వీనినిఁ బరిమార్చువిధ మొక్కటి గల దాల కింపుము. వీనినాభిచుట్టును విశల్యసంజీవకరణు లలముకొని యున్నయవి. ఏతన్మాహాత్మ్యంబున నీతనితలలు హస్తములు తెగియు మరలమరల మొలచుచున్నవి. కావున నాగ్నేయాస్త్రమునఁ దత్తదౌషధుల నెల్ల దగ్ధముఁ గావించి పిమ్మట బ్రహ్మాస్త్రమున నొండె, శక్తిచే నొండె వీనిని సంహరింపవల యును.''

,, ఇదియునుఁగాక మఱియు నొక్కరహస్యము గలదు. తరుణిపోర నెంచుట తప్పిదముగా నీ వెంచఁబోకుము. తొల్లి యెవ్వాలిచేఁ జావఁ దొల్లి వీనికి శాపము గలదు. అది యెట్టు లంటి వేని వినుము.

పూర్వ మొకప్పు డీశతకంఠుఁడు దిగ్విజయ మొనరింప నెంచి బంధుమిత్రామాత్యులతో బయలువెడలి సమస్త దేవ తాదుల నుల్లంఘించి మరలి వచ్చుచు మార్గమధ్యమునఁ గణ్వ ఋష్యాశ్రమముఁ జొచ్చి యందందు శోధించి యమ్మునిపట్టి యగు విమలాంగి యను వెలఁది నీక్షించి యామెచక్కఁదన మున కచ్చెరు వంది మోహించి యామెను సమీపించి యి ట్లనియె.

,,తరుణీశిరోమణీ! కనకమయసౌధములలోఁ దూఁగు టుయ్యాలలపైఁ దూఁగుచుఁ బట్టుపుట్టముల ధరించి శాల్యన్న ములు షడ్రసోపేతముగ భుజించి హంసతూలికాతల్పముపై

శయనించి సౌఖ్యం బొందఁజాలిన సుకుమారి వగు నీ విట్లీల ఘోరావనమున వసించి నారచీరలఁ దాల్చి, కందమూలములు భుజించి, కటికుదర్భలపైఁ బరుండ నెంచెదవు? నీయునికిఁ జూడ నా కెంతయు సంతాపకరముగ నున్నది. నేను *త్రికరణశుద్ధిగఁ జెప్పుచుంటిని. నిన్ను నాపట్టపుదేవికన్న మిన్నగఁ జూచుకొనెదను. కావున నీ విప్పుడు నా వెంట నరుదెంచి నన్ను గాంధర్వమున ♦వివాహమాడి సకలసౌఖ్యముల ననుభవింపుము."

అని యనేకవిధములఁ బలుకఁదొడఁగిన నవ్విమలాంగి యడలుచు "ఓరీ! దుష్టదానవా? కండకావరమున నీ వేమేమిరో నోటికి వచ్చిన ట్లెల్ల వదరఁజొచ్చినాఁడవు. నీ విట్టి చెడుపోకలఁ బోయితివేని నీయాయు వడంగును. చేసినపుణ్యంబెల్ల నశించి నరకము సిద్ధింపఁగలదు.

ఇదియునుఁగాక నన్నత్యంతగారాబమునఁ బెంచుకొనుచున్న †పితృతుల్యుఁడగు కణ్వుఁ డీవృత్తాంత మెఱింగెనేని నిన్నిప్పుడే భస్మీభూతునిఁగ శపింపఁగలఁడు. కావున బుద్ధిఁ దె

*త్రికరణములు:—1 మనస్సు 2 వాక్కు 3 కర్మము.

♦వివాహములు:—1 బ్రాహ్మ్యవివాహము 2 దైవవివాహము 3 ఆర్షవివాహము 4 ప్రాజాపత్యవివాహము 5 ఆసురవివాహము 6 గాంధర్వవివాహము 7 రాక్షసవివాహము 8 పైశాచవివాహము.

† పితృపంచకము:—1 తన్నుఁగన్నవాఁడు 2 తనకువడుఁగుజేసిన వాఁడు 3 చదువుచెప్పినవాఁడు 4 విపత్తున అన్నముఁబెట్టి కాపాడినవాఁడు 5 ఆపదయందు భయముఁదీర్చి రక్షించినవాఁడు.

చ్చకొని నీవాఁడని నీవు పొమ్మని చతురుపాయంబుల ధర్మ
ముఁ దెలిపియు, మర్మముఁ గలఁచియు, నెఱపించియుఁ, బొడి
గా దనియుఁ జెప్పి మదోన్మత్తుఁ డగు నాశనితమకమున కెంత
యు భీతి నొందుచు నలుదిక్కులఁ బరికించుచుండెను.

అంత శతకంఠుఁ డుద్దండుఁ డగుచు ,, సతిమణీ! ఐశ్వ
ర్యవిహీనుం డగు నొక్క పేదతపసిం జెప్పి నన్ను వెఱపింపఁజూ
చెద వింతమాత్రమునకె నే భయపడుదు ననుకొంటివే?" అని
వచించుచు మోహాతిరేకమున నావడఁతిని బలిమిమైఁ బట్టి
శతముఖములఁ జుంబనములు గావించి యత్యంతప్రియానమున
నామెను బరిభవించెను. అంతట సద్యోగర్భమై యామె బాల
కుం గని, యమ్మహాదనుజుని దేహము తనపయిఁ బడుటం జేసి
తద్భరమున కామె శరీరముఁ ద్యజించెను.

పిమ్మట, సమిధలకొఱకై యరణ్యమునకుఁ బోయిన
కణ్వుఁడు తనకూర్మిపట్టి యొంటి నుండు నని రయమున నాశ్ర
మమున కరుదెంచి, యచ్చోట విహరించుశతాననునిఁ గని భ
యమునొంది పర్ణశాలలోనికిఁ జని యందు రోదన మొనరించు
శిశువుం గని, యవ్వలశవమై పడియున్న విమలాంగిం గాంచి మ
హాదుఃఖమొందుచుఁ *త్రికాలజ్ఞుఁడుగావున దివ్యదృష్టిచే నం
తయుం దెలిసి యత్యంతకోపమున శతకంఠునిఁ గదియంజని,

* త్రికాలములు—1 భూతకాలము, 2 భవిష్యత్కాలము, 3 వర్త
మానకాలము.

"ఓరీ! దుర్మార్గుఁడా! నీ విట్లు దుర్మదమున నతి దెంచి నాపెంపుడుకూతు నిత్తెఱఁగున మానభంగ మొనరించి ప్రాణములఁ గొనియున్నవాఁడవు గావున, నీ వొకతరుణిచేఁ దలలు తునియలై యిట్లే మరణ మొందగల" వని శాపంబొసంగెను. అంత శతముఖుఁ డెక్కడి చేడియ లెక్కడి చంపుట లని కణ్వునిమాటలు సరకుసేయక నిజపురంబున కరిగెను.

ఇదియునుంగాక నాశతాస్యుఁడు పరమేష్ఠిని వరములు వేఁడుతతి స్త్రీలచేఁ దనకుఁ జావు లేకుండ నడుగఁడయ్యె. ఇప్పుడు తచ్ఛాపం బనుకూలంబయ్యెఁ గావున నాదిపరంజ్యోతి యగు సీతాదేవిచే నాతఁ డవశ్యంబుఁ గూలు. నీ విఁకఁ దడయక సీదేవి నాలంబునకుఁ బురికొల్పుము." అని నారదమునీంద్రుఁడు హితోపదేశముఁ జేసి యంతర్ధాన మొందెను.

రామభద్రుండును బరమాశ్చర్యచిత్తుఁడై సీతకుఁ ద ద్వృత్తాంత మంతయుఁ జెప్పి "యిఁక జాగుసేయక దానవునిఁ బరిమార్పవలయు"నని పురికొల్పిన జానకి యలరి, భేరీమృదంగ తూర్యాదినానావిధము లగు వాద్యములు వినోదములుగా నఖిలభువనములు నిండ నుద్దండప్రచండభుజాదండమునఁ గోదండం బంది యనలకల్పకాండపరంపర తేర్చి, హయములఁ గూల్చి, సారథిని వ్రాల్చి, కేతనములు పొడిచేసి, చక్రములు విక్రమమున ఖండించి, పలక లలుకమై వ్రక్కలు గావించి యనలాస్త్రమున శతాస్యుని నాభిం గల మహౌషధీలతలు భస్మముఁ

గావించి, మహాపరాక్రమమున బ్రహ్మాస్త్రము నంధించి,

"గీ. అవనిపై నేఁ బతివ్రత నగుదునేని
యరయ రాముఁడు ధర్మాత్ముఁ డయ్యెనేని
*వేదములు సత్య మగునేని, వీఁడు నిమ్మ
హాస్త్రరాజంబుచే దగ్ధుఁ డగునుగాక."

అని పటుదర్పమున నేయ నప్పు డాదివ్యసాయక మాతిర యమునఁ జిచ్చు లీనుకొనుచు నేఁగి యసురవరునికరము లెల్లఁ దుంచి, యొకశిరముదక్కఁ దక్కినవాని నెల్ల నల్లన పుడమిపైఁ గూల్చెను.

మఱియు నాసీతయతికౌశలమున శక్తి వైవ నది మంటల నీనుచుఁ జని దైత్యునిశిరముఁ దుంచి శరీరమును జీల్చిన నసురవరుఁ డాహాకారము సేయుచు వజ్రాయుధమునఁ గూలు కొండవోలె నేలపైఁ గూలెను.

అప్పుడు రాఘవుఁ డపరిమితానంద మొందెను. దేవతలు పుష్పవృష్టిఁ గురియించిరి. లోకములెల్ల నంతసించె. నారదాదిమునివరులెల్ల రత్యంతసంతోషమున నచ్చటి కేతెంచిరి. సీత రామునిపాదములకు మ్రొక్కెను. రాముఁ డామె నక్కునఁ జేర్చి "ప్రియురాలా! నీకతమునఁగదా, నేఁ డింతటి ఘోర

---

* వేదములు—1 ఋగ్వేదము, 2 యజుర్వేదము, 3 సామవేదము, 4 అథర్వవేదము.

వైరము చల్లాఱినది. నీకీర్తి యాచంద్రతారార్క మవనిపై నిలుచుఁగాక. ” అని దీవించెను.

అంతఁ బరమేష్ఠి ప్రత్యక్షమై “ వైదేహీ ! నీయుద్ధనై పుణ్యమునకు నే నెంతయు మెచ్చితి. నీవిజయము మా కెంత యు ముదావహమయ్యెను. నీ కేమి వరము గావలయునో కో రుకొను మిచ్చెద ” ననుటయు, జానకి తనభర్తయానతిపై న లువ కిట్లనియె.

“ ఓసురజ్యేష్ఠా ! మావిజయమున కంతకు నీవే కార ణుఁడవు. ఇందు మేము చేసిన దే మున్నది ? నీ విట్టియవ్యాజ కారుణ్యము మాపైఁ జూపినందులకు మే మెంతయు ధన్యుల మైతిమి. మాకొఱకై రణరంగమున మరణించిన రాజుల నెల్లర సైన్యములతోఁ బునర్జీవితులఁ జేయవే ” యని వేఁడుకొనెను.

అంతఁ బితామహుఁ డట్లె యని వచించి యింకొకవ రముఁ గోరుకొ మ్మనుటయుఁ బుడమితనయ మిక్కిలి సంతోష మంది వానరవిభీషణసైనికులను, మఱఁదులను, బుత్రపౌత్రి తులను బ్రదికింపు మని కోరుకొనెను. పద్మగర్భుఁడు వారల నెల్లర సజీవులఁ జేసెను.

పిమ్మట హతశేషు లగు దానవులు కొంద ఱరిగి చిత్రి గంధికిఁ దనయునిమరణవార్త నెఱింగింప నామె క్రోధంబుతో గోలుగోలున నేడ్చుచు నరుదెంచి యొక్కయెడఁ దలలు దివి పోక నేలపైఁ బడియున్న శతకంఠు నీక్షించి, యనేకప్రకార

ములఁ గోదండుఁడును, దానును నతనిపయిఁ బడి మోఁదుకొనుచు హా హా విక్కేఁది యనుచు, సీతను దూఁఱుచు బాష్పములు రాల్చుచు మఱిమఱి విలపించుచు నంతకంతకుఁ బుత్త్రిశోకము భరింపఁజాలక లోమ్ముమను, శిరమును మోఁదుకొనుచు నిట్లు తలఁచితలఁచి దుఃఖింపసాగెను.

సీ. "సురవర్గముల నెల్లఁ జెఱలువట్టిన నీమ
హాజ్ఞ దా నెచ్చట నణఁగెఁ దండ్రి ?
దిక్కరిఘటముల వ్రిక్కలు గావించు
నీభుజశక్తి యే నీటఁ గలసె ?
మొగమెత్తి కనుఁగొని ముక్కంటి నైనను
వెఱపించు లావెటు వీటిఁబోయె ?
నీతపంబునకు విధాతృఁ డిచ్చినయట్టి
వరముల మహిమ యేవఱదఁగలసె ?

గీ. వెలయ రాఘవుఁ డాదిమవిష్ణుఁ డంటి
నుదతి జానకి యప్పరంజ్యోతి యంటిఁ
గపులు సుర లంటి, జయములు గలుగవంటి
నకట ! వినవైతి వేమందుఁదనయ ?"

ఈవిధముగ శోకించుచువాపోవు చిత్రగంధిని, వివశులై పడియున్న కోదండ్రిను రాఘవుఁ డనునయించి "యేల మీ రిట్లు చింతాసాగరమున మునిఁగెదరు ? ఆహవమున జయాపజయము లందఱకును సహజములేగదా? అదిగాక, రణరంగమున

విల్లువ్రాని మాత్రో నిల్లు పోరినవాఁడును, నీవిధమునఁ గూలిన వాఁడును, నింకొకఁ డీధరాతలమున లేఁడు. కావున నన్నివిధముల నీతఁడు గృతార్థుఁడు. మీరికఁ జింతలుడుగుఁడు."

అని వచించి విభీషణునిఁబిలిచి శతకంఠున కగ్నివిధులు నలిపిర మ్మని నియమించుటయు, నాతం డరిగి తత్కృత్యము లెల్ల *దశవిధదానాదులతో నాచరించి యేతెంచెను.

పిమ్మట శతాననునిసుతుఁడును, సుగుణశీలుఁడు నగు నీలకేతనునకు నీలమేఘశ్యాముఁడును, దయాసముద్రుఁడు నగు రామభద్రుఁ డత్యంతప్రేమతోఁ బ్రితావలంకాపురమునకుఁ బట్టంబుఁ గట్టి, తొల్లింటివలెనె యాంజనేయునిసాహాయ్యమున సముద్రములు దాఁటి యనుజతనుజాదులతో మరల నయోధ్యాపట్టనమున కేతెంచెను.

ఇట్లరుదెంచి ♦మాతృజనులఁ గాంచి నమస్కరించి, గురుఁ డగువసిష్ఠ‡ఋషినిఁ బూజించి జానకి సూపినపౌరుషము తెఱం గెల్లర కెఱింగించి, సుమంత్రాదిమంత్రు లౌ నని మెచ్చ

---

* దశదానములు__1 గోదానము, 2 భూదానము, 3 తిలదానము, 4 హిరణ్యదానము, 5 ఘృతదానము, 6 వస్త్రదానము, 7 ధాన్యదానము, 8 గుడదానము, 9 రౌప్యదానము, 10 లవణదానము.

♦ మాతృపంచకము__1 రాజుభార్య, 2 అన్నభార్య, 3 గురుభార్య 4 భార్యనుగన్నతల్లి, 5 తన్నుఁగన్నతల్లి.

‡ ఋషులు__1 కశ్యపుఁడు, 2 అత్రి, 3 భరద్వాజుఁడు, 4 విశ్వామిత్రుఁడు, 5 గౌతముఁడు, 6 జమదగ్ని, 7 వసిష్ఠుఁడు.

విభీషణసుగ్రీవుల నత్యంతాదరమునఁ జేరఁబిల్చి, వారికిఁ గన కాంబరమణిభూషణాదులఁ గానుక లిచ్చి, వారల నిజపురంబుల కనిచి, తక్కుంగల ధరారమణుల నెల్లర నుచితరీతి గౌరవించి వారివారిదేశములకుఁ బనిచి, సీతాసహితముగ నాంజనేయున కనేకవిధముల సత్కారములు గావించి, యతనిని గందమాదన మున కనిచి, యనుజులు, మంత్రులు, బంధుమిత్రాదులు గొలువ, *ఈతిబాధలు లేకుండఁ బ్రజల బిడ్డలవోలెఁ గాపాడుచు, ♦నవగ్రహములలోఁ జంద్రునివలె రాజాధిరాజులకెల్ల మేటికిరీటుఁడై వెలయుచుఁ బ్రజారంజకముగఁ జిరకాలము రాజ్యపాలన మొనరించెను.

శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ సుకవితావిలసిత
శ్రీ పీఠికాపురమహారాజపరిపోషిత, దాసరి
కొండయాఖ్యసుజననుత, సకలజనవిధేయ
లక్ష్మణనామధేయప్రణీతంబైన
సీతావిజయము సర్వంబును
పరమేశ్వరార్పణమస్తు
శ్రీ

* ఈతిబాధలు—1 అతివృష్టి, 2 అనావృష్టి, 3 మిడుతలు, 4 ఎలుకలు, 5 చిలుకలు 6 చేరువరాజులు.

♦ నవగ్రహములు—1 సూర్యుఁడు, 2 చంద్రుఁడు, 3 అంగారకుఁడు, 4 బుధుఁడు, 5 బృహస్పతి 6 శుక్రుఁడు, 7 శనైశ్చరుఁడు, 8 రాహువు, 9 కేతువు.

# నాలుగుభాషలనిఘంటువు

ఇందు 5000 తెలుగుమాటలు అకారాదిగా వ్రాసి వాని కెదురుగా హిందుస్థానీ, ఇంగ్లీషు, అరవముపదములు చేర్పఁబడినవి. ఏపదముకావలసినను వెంటనే గ్రహింపవచ్చును. ఇది విద్యార్థులకు, స్కూలుమాష్టర్లకు, లాయర్లకు, గుమాస్తాలకు, వర్తకులకు, ప్రయాణీకులకు మిక్కిలి యుపకరించును. ఇదిచదివినచో గురుసాహాయ్యమక్కఱలేకుండ పైభాషలు మాటలాడుశక్తి కలుగును. వెల 8 అణాలుమాత్రమేగాని 800 రూపాయలకు మించిన ఫలిత మొసంగును.

# విజయవిలాసనాటకము

చేమకూర వేంకటకవికృతవిజయవిలాసములోనిరసవంతములగు పద్యములఁ జేర్చి వ్రాయఁబడినది. ఇది సమస్తజనుల కుపయోగకరమైనది. వెల రు 0-10-0.

# భర్తృహరిప్రబోధము

ఈనాటకమునందు (1) కన్యాశుల్క-వరశుల్క-నిరసనము (2) స్వయంవరణము (3) గృహస్థవిధులు (4) భగవత్సేవావిధానము (5) వారకాంతలచర్యలు (6) పతివ్రతాధర్మములు (7) సంసారవివేచనము (8) నిర్వేదము, మున్నగువిషయములుఁగలవు. వెల రు 0-10-0

# దీనపోషకశతకము

ఇది సర్వజనపఠనీయమైభక్తిజ్ఞానముల బోధించుచుండును. వెల రు 0-2-0

దాసరి లక్ష్మణస్వామి.
పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా